Regd No. M.1118.

14 పేజీలు-2 అణాలు



# ఆంధ్రపత్రిక

Founder: K. NAGESWARA ROW. SUNDAY EDITION.
Vol. 36. ANDHRA PATRIKA, MADRAS. 13th NOVEMBER 1949 No. 220



# ఆంధ్రరాష్ట్ర తక్షణ నిర్మాణానికి సంపూర్ణావకాశం

# నాయకత్రయ నివేదికకు రాష్ట్రకాంగ్రెసు సమావేశ ఏకగ్రీవామోదం

## సభ్యుల హర్షధ్వానాలు

### ఆంధ్రజీవితంలో ఇది గర్వించదగిన రోజని కళా వెంకట్రావుగారి ప్రకటన

[ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రతినిధి]

**విజయవాడ, నవంబరు 12: "ధారకవిూషన్‌చే బలపరచబడి, మద్రాసునగర భవిష్యత్తుపై పట్టాభిగారి హామీవల్ల నూతన దృక్పథముతో నాయకత్రయ నివేదికను అర్థము చేసికొనుటకు ఆంధ్రులకు అవకాశము కలిగినది.**

**కనుక ఈ సంఘమువారు జె. వి. పి. రిపోర్టును నిస్సందేహముగ ఒప్పుకొనుచు 12 తెలుగు జిల్లాలతో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము చేయవలసినదిగా అఖిలభారత కాంగ్రెసు సంఘ కార్యవర్గమును, భారతప్రభుత్వమును కోరుచున్నారు" అని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం గత సాయంత్రం గం. 7-30 కు శ్రీ దుర్గా కళామందిరంలో ఏకగ్రీవంగా తీర్మానించింది.**

తీర్మానం అంగీకృతమవగానే సభాస్థలి 'ఆంధ్రరాష్ట్రానికీ జై' అనే జయజయధ్వానాలతో మారుమ్రోగింది.

సమావేశం మధ్యాహ్నం 3-30 గంటలకు శ్రీ ఎన్. జి. రంగాగారి అధ్యక్షతను ప్రారంభమైంది. శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు తీర్మానం ప్రతిపాదించారు. శ్రీ పి. తిమ్మారెడ్డిగారు బలపరిచారు. నాలుగుగంటలసేపు జరిగిన చర్చలో 15 గురు పాల్గొన్నారు. ఈ 15 గురి ప్రసంగాలుకూడా తీర్మానానికి వివిధ దృక్పథాలవారి 15 ఆమోద ముద్రలే ననవచ్చు. చెన్నపట్నం, తత్పరిసరాల విషయమై పట్టాభిగారి హామీమాత్రమే ఓదార్పుగా వున్నందున, ఆ ప్రదేశాల విషయమై అందరూ చాలా ఆందోళన కనపర్చినా, మొత్తంమీద తీర్మానాన్ని ఏకగ్రీవంగా, సాధ్యమైనంత తక్కువ ఘర్షణతో ఆమోదించాలనే అభిప్రాయపడినారు. అసలు తీర్మానమే పట్టాభిగారి హామీపై ఆధారపడి వున్నందున, ఎవ్వరూ హామీలు గానీ, రక్షణలుగానీ కోరలేదు. కొందరిలోగల ప్రతిఘటనాభావంకూడా నిర్నిబంధ ఆమోదానికి తావు ఇచ్చింది.

ఈ తీర్మానం చెన్నపట్నం లేకుండా ఆంధ్ర రాష్ట్రం కావాలని కోరుతున్నందున దానిని ప్రతిఘటించడానికి తాము వచ్చారని, కాని ఇక్కడ అంతా ఏకాభిప్రాయంతో ఉండడంవల్ల తమ ఉద్దేశాన్ని మార్చుకోక తప్పక వచ్చిందనీ కనుక తాము ఈ తీర్మానాన్ని బలపరుస్తున్నారనీ, అయినా తమ కోరిక ఇంకా నీళ్ళు కారి పోకుండా ఉంటుందనే కొన ఆశతో ఉన్నారనీ అనంతశయనం గారు అనగా సభ్యులు హర్షధ్వానాలు చేశారు.

బులుసు సాంబమూర్తిగారు కూడా చెన్నపట్నంపై ఆంధ్రజాతికి గల హక్కును ఎన్నటికీ వదులుకోజాలమని ఉద్ఘాటిస్తూ తీర్మానాన్ని బలపరిచారు.

కల్లూరి సుబ్బారావుగారు, రాష్ట్ర నిర్మాణానికి తాము ప్రతికూలురని భవిష్యచ్చరిత్ర కారులు చిత్రించడం రాయలసీమ వాసుల కిష్టంలేదని నుడివారు.

తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడడం, పుత్రోదయంకోసం నిరీక్షిస్తున్న యువకులవలె, కేదుదయంకు ప్రతీక్షిస్తున్న ప్రేక్షకులలో సంభ్రమ సంతోషాలు కలిగించింది. వారికి ఈ తీర్మానంతో రాష్ట్రం ఆవిర్భవించినట్లే అనిపించింది.

సమావేశానికి మొత్తం 167 మంది రాష్ట్రకాంగ్రెసు సభ్యులు, పలువురు ప్రముఖులు ప్రేక్షకులు హాజరైనారు. సభాస్థలి వెలుపల పలువురు శ్రద్ధ వివు-యంత్రాలద్వారా చర్చలు వింటూ నిలబడ్డారు.

### తీర్మానంపై ప్రముఖుల అభిప్రాయాలు

కళా వెంకటరావుగారు

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఆంధ్రరాష్ట్రం విషయమై చేసిన తీర్మానం గురించి కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకటరావుగారు ఈ దిగువ అభిప్రాయం వెల్లడించారు. ఈ రోజు ప్రతి ఆంధ్రుని జీవితంలో ఒక గర్వించదగిన

(3వ పేజీ చూడుడు)

## కేంద్రప్రభుత్వోద్యోగులకు నిర్బంధ పొదుపు విధానం

### పెద్దజీతాలు తగ్గించినట్లు ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 11: రూ 250 లు పైబడిన నెలజీతాలుగల ప్రభుత్వోద్యోగులందరూ తప్పని సరిగా డబ్బు నిలువచేసే ఒక నూతనవిధానం అమలు జరపడానికి ఇండియా ప్రభుత్వం నిర్ణయించినట్లు నేడు ఆర్థిక శాఖవారు ప్రకటించారు.

ప్రభుత్వ కార్యదర్శులు, అదనపు కార్యదర్శులు, సంయుక్త కార్యదర్శులు రైల్వేబోర్డు చీఫ్ కమిషనర్, ఆర్థిక కమిషనర్ తమ జీతాలతగ్గింపును ఆమోదించి ఉన్నారు. 3000 రూ. జీతాల లో నుంచి రూ.250 లున్నా, 3000 పైబడిన జీతాల నుంచి 250 రూపాయలూ, పైబడిన మొత్తంలో నాలుగోవంతూ తగ్గించాలని ప్రభుత్వం వారు నిర్ణయించారు.

1949 నవంబర్ నుంచి 1952 ఫిబ్రవరి ఆఖరు వరకు తమ జీతాలలో నూటికి 15 వంతులు తగ్గించుకో గలమని మంత్రులు మాట ఇచ్చి ఉన్నారు.

కంట్రాక్టు పద్ధతిపై ఉద్యోగాలలో ఉన్న ఆనియేతర పౌరుల జీతాలూ, తదితరుల జీతాలూ తగ్గించ బడవు. సివిలు, రక్షణ, రైల్వే, తపాలా తంతి శాఖలలో ఉద్యోగాలు చేస్తూ గవర్నరు జనరలు శాసనానికి లోబడి ఉన్న ఉద్యోగులందరి జీతాలూ తగ్గించ బడతవి. ఇలా జీతాలు తగ్గించబడిన వారు డబ్బు నిలువ చేసుకోవడం తప్పని సరికాదు.

గవర్నరు జనరలు శాసనానికి లోబడి ఉన్న పై అధికారులలో 250 బడిన జీతాలు కలవారందరూ వదో ఒక ప్రావిడెంటు ఫండుకు డబ్బు కట్టాలి. కట్టవలసిన మొత్తం ఈ కింది విధంగా ఉంటుంది. 257 లగాయతు 500 జీతం గల వారు రూపాయికి అణన్నర; 501 మొదలు 1000 జీతం గల వారు రూపాయికి 2 అణాలు; 1001 మొదలు 2000 జీతంగలవారు రూపాయికి రెండున్నర అణాలు; 2001 మొదలు; 3000 జీతం గల వారు రూపాయికి మూడు అణాలు; 3001 పై బడిన జీతాలు గలవారు రూపాయికి మూడున్నర అణాలు కట్టాలి.

ప్రావిడెంటు ఫండు కింద ప్రభుత్వం కట్టే మొత్తాలు ఇదివరలోలాగే ఉంటవి. ప్రభుత్వోద్యోగులలో ఆనియేతర పౌరులకు ఈ విధానం వర్తించదు.

కంట్రాక్టు పై ఉద్యోగాలలో ఉన్న వారి కంట్రాక్టు షరతులను పాలించి నట్లయితే వారికి ఈ విధానం వర్తిస్తుంది. ఈ విధానం 1949 డిసెంబరు 1 నుంచి 1952 మార్చి 1 వరకు అమలులో ఉంటుంది.

ఇతర ప్రజలకు కూడా ఇటువంటి విధానాలు అమలు చేయడానికి ఆలోచనలు జరుగుతున్నట్లు ఈ ప్రకటన తెలుపుతున్నది.

## కృష్ణా జిల్లాలో మరణాలసంఖ్య 615

### అధికార వార్త

చెన్నపట్నం, నవంబరు 12: కృష్ణా జిల్లాలో తుపానువల్ల కలిగిన మరణాల సంఖ్య 615 వరకు పెరిగినదని మద్రాసు ప్రభుత్వమునకు అధికారరీత్యా వార్త వచ్చినదని రెవిన్యూమంత్రి సీతారామరెడ్డిగారు ఆంధ్రపత్రిక ప్రతినిధితో తెలిపిరి. నల్గురు రెవిన్యూబోర్డు సభ్యుల నివేదికలూ చేరినవనియు, సహాయ సౌకర్యములకు ప్రభుత్వము సర్వవిధములా పాటు పడుచున్నదనియు తెలిపిరి.

## కాందిశీకుల ఆస్తి విషయమై పాకిస్తాన్‌తో సమాలోచన

### ఇండియా ప్రతిపాదించలేదని ఢిల్లీ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 11: కాందిశీకుల ఆస్తుల సమస్యపై తుది నిర్ణయం చేయటానికి అంతరధినివేశ సమావేశం జరపాలని ఇండియా ప్రతిపాదించినట్లు పాకిస్థాన్ పత్రికలలో ప్రకటించబడినవార్త నిజం కాదనీ, ఇండియా అటువంటి ప్రతిపాదనేమీ చేయలేదనీ నేడు భారత ప్రభుత్వం ప్రకటించినది. ఈ ప్రతిపాదనను భారత ప్రభుత్వమంత్రి గోపాలస్వామి అయ్యంగార్ పత్రికా విలేఖరుల గోష్ఠిలో వెల్లడించాడనీ ఆవిషయమై తనకు అధికారరీత్యా ఏమీ తెలియదనీ పాకిస్తాన్ కాందిశీక శాఖామంత్రి డా॥ ఖురేషీ పత్రికా విలేఖరులతో అన్నట్లు పాకిస్తాన్ పత్రికలు ప్రకటించినవి.

"గోపాలస్వామి అయ్యంగార్ పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తూ కాందిశీక ఆస్తి సమస్యను పరిష్కరించటానికి గల వివిధ మమార్గాలనూ చర్చించాడు. ఉభయ అధినివేశాలూ అత్యున్నత స్థాయిలో ఆ విషయమై చర్చించినప్పుడు సమస్య పరిష్కారం కాగలదని మాత్రమే ఆయన అన్నాడు. కాని సమావేశాన్ని ప్రతిపాదించలేదు. పాకిస్థాన్ ప్రభుత్వం గురించి జగనంత కాలంబా ఇండియా అటువంటి ప్రతిపాదన చెయ్యదు.

భారతప్రభుత్వం ఢిల్లీ ఒడంబడికను ఉల్లంఘించినట్లు చేయబడిన ఆరోపణనిరాధారమైనది. కాందిశీకులకు సక్రమ పరిష్కారం ఇవ్వనిదే వారి ఆస్తులను ఏ అధినివేశనమూ స్వాధీన పరచుకోరాదనే భారత ప్రభుత్వం మొదటినుంచీ వాదిస్తున్నది. ఈ సక్రమ పరిహారాన్ని ఉభయ దేశాలూ కలిసి నెల కొల్పిన సమిష్టి సంస్థ మాత్రమే నిర్ణయించ గలదు. కాని పాకిస్థాన్ ప్రభుత్వం ఈ ఆలోచనే లేకుండా కాందిశీకుల ఆస్తిని పరిహారం కానీ అద్దె కాని ఇవ్వకుండా వశంచేసు కుంటున్నది. పాకిస్తాన్ ఈ విధానం అనుసరించే అంత కాలం అంతరధి నివేశన సమావేశాలవల్ల లాభం ఉండదు." అని ఆప్రకటన వివరించినది.

## అమెరికాలో పౌరహక్కుల కార్యక్రమ నిర్వహణావశ్యకత

### ప్రెసిడెంటు ట్రూమన్ పునరుద్ఘాటన

వాషింగ్టన్, నవంబరు 11: క్రైస్తవ, యూదు, మహాసభ సమావేశంలో అధ్యక్షుడు ట్రూమన్ ప్రపంచ సంగ్రామ విరామోత్సవదిన సందర్భాన ఉపన్యసిస్తూ, అన్యాయమును, పక్షపాతమును నానురూపాలు ... చేయాలనీ, ఈ లక్ష్యాన్ని సాధించడానికి తాను నిర్వచించిన పౌరహక్కుల కార్యక్రమమును అమలుజరపడం ఒక్కటే సాధనోపాయమనీ చెప్పెను.

జనవరిలో తాను, కాంగ్రెసు సమావేశంలో చేసే ప్రారంభోపన్యాసంలో, ఈ పౌరహక్కుల కార్యక్రమమును ఆమోదించవలసిందని ట్రూమన్ కాంగ్రెసుకు తిరిగి విజ్ఞప్తి చేయగలడని, ఈ ప్రసంగాన్ని బట్టి ఊహించడం అవుతుంది. "జాతివర్ణ విచక్షణలు కొన్ని అమెరికాలో ఇప్పటికీ చెల్లుబడి అవుతున్నవని మనం గుర్తించక తప్పదు. కాని ఈ విచక్షణలను తొలగించడానికి మనం హృదయపూర్వకంగా కృషిచేస్తున్నాము. ఇటి వినక్షణలకు అవకాశం ఇవ్వరాదని అమెరికా గాఢంగా విశ్వసిస్తున్నది; అమెరికా రాజ్యాంగంలో కూడా ఈ విషయం అసందిగ్ధంగా పేర్కొనబడినది. మనం ప్రస్తుత రాజ్యాంగం క్రింద ఉన్నంతవరకు పౌరహక్కుల కార్యక్రమాన్ని అమలుజరపకుండా ఎలా తప్పుతుందో నాకు అర్థం కావటం లేదు."

## రష్యా శాంతికోసమే పరితపిస్తున్నదట

### అమెరికా రష్యా సామరస్య సంఘ సమావేశంలో విషిన్‌స్కీ ప్రసంగం

న్యూయార్కు, నవంబరు 11: రష్యా విదేశాంగ మంత్రి ఆంద్రీ విషిన్‌స్కీ గతరాత్రి అమెరికా రష్యాల సామరస్య సంఘ సమావేశంలో ఉపన్యసిస్తూ, తాము శాంతికొరకూ, సమత్వం కోసమూ, కృషిచేస్తున్నామని, చెప్పెను.

"రష్యా సామ్యవాద దేశం. ఈ విషయమై ఎవరికీ ఏవిధమైన అనుమానమూ ఉండనవసరంలేదు. మాకు ధనికవాదం గిట్టదని, నిర్మొహమాటంగా చెప్పివేయగోరుతున్నాను. అయితే మీ అంతరంగిక వ్యవహారములలో జోక్యం కల్పించుకోవాలనేకోరిక మాకు ఏ కోశానా లేదు." అనికూడా విషిన్‌స్కీ అనెను.

"ప్రపంచంమీద ఆధిపత్యాన్ని సాధించడానికై అమెరికా నడుపుతున్న తంత్రాంగాన్ని" విమర్శిస్తూ తానువ్రాసుకొనివచ్చిన ఉపన్యాసాన్ని చదవడానికి బదులు, విషిన్‌స్కీ విషయం మార్చి శాంతికోసం రష్యా పడుతున్న తాపత్రయం గురించి సమావేశంలో ప్రసంగించెను. విషిన్‌స్కీ ధర్మోక్తులాడుతూ మామూలుకన్న చాలా ఉల్లాసంగా కనిపించెను.

మేకపిల్లకు తల్లి మెడనున్న గళస్తనాలు ఎంత ఉపయోగకారో, సోషలిజానికు ఎర్నెస్టు బెవిన్ అంత ఉపయోగపడుతాడని విషిన్‌స్కీ ఎగతాళిచేసెను.

"అమెరికా రష్యాల మధ్య పరస్పర సామరస్యాలు ఏర్పడటం ఉభయదేశాల యోగక్షేమాలకే గాక, యావత్ప్రపంచ యోగక్షేమాలకు ప్రపంచ శాంతికీ కూడా లాభకారి. ఈ సఖ్యత విచ్ఛిన్నం కాకుండా చూడడానికై మీరు చేస్తున్న ప్రయత్నాలు అభినందనీయాలు.

(3వ పేజీ చూడుడు)

## విజయవాడసభలో రాయలసీమవారి పట్ల చూపిన విశేషాదరాభిమానాలు

### మంత్రి సంజీవరెడ్డిగారి అభినందన

### ఆంధ్రరాష్ట్ర తీర్మానంపై మద్రాస్ రాజకీయ వర్గాల సంభ్రమాశ్చర్యాలు

చెన్నపట్నం, నవంబరు 11: ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సందర్భమున ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు నాయకత్రయనివేదికను అనిర్ద్వంద్వముగా అంగీకరించుచునూ, చెన్నపట్నమును, పరిసర ప్రాంతములను ప్రత్యేక రాష్ట్రముగా నిర్మించవలెననీ ఏకగ్రీవముగా గావించిన నిర్ణయము మద్రాసు రాజకీయవర్గముల వారిని, ముఖ్యముగా తమిళ నాయకులను సంభ్రమాశ్చర్యచకితుల చేసినది. చెన్నపట్నంపై తెనుగువారు హక్కు వదలుకుంటూ చేసిన నిర్ణయానికి తమిళ నాయకులు ఒకవంక సంతోషిస్తున్నా చెన్నపట్నాన్ని, చుట్టుపట్ల ద్విభాషాప్రాంతాలను ప్రత్యేకరాష్ట్రంగా చెయ్యవలెననే దాన్ని సులభముగా స్వీకరించలేకున్నారు. ఈసందర్భమున ఆంధ్రనాయకులు ప్రదర్శించిన రాజకీయచాతుర్యము, ప్రశాంత మనస్కత, ఏకీభావము తమిళుల నాయకుల కల్లోలపరచినది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు నాయకత్రయ నివేదికను అరమరలేకుండా ఆమోదించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు దోహదముచేసి, చిరకాలముగా మద్రాసు రాజకీయాలలో నెలకొని ఉన్న అనిశ్చయ వాతావరణమును తీవ్ర భాషాభావములను తొలగించిరి. రాష్ట్ర కాంగ్రెసు తీర్మానమును తమిళులు సైరించినా సైరించకున్నా ఈ సమస్య ఒక విధముగా తేలిపోవుసమయము వచ్చినది గదా అని కేరళులు, తమిళులు, మళయాళీలుగూడా ఏదో ఒక భారము తీరిపోయి నట్లు ఆనందించుచున్నారు.

**శాసనసభల ఆనంద దృశ్యములు**

నేడు చెన్నపట్నములో తమిళులు ఆంధ్రులు, ఒకరి నొకరు కలుసుకొన్నపుడు స్నేహపూర్వకముగా విడిపోవుచున్నందులకు పరస్పరము అభినందించుకొనిరి. శాసనసభ సమావేశముగుటకు ముందు ఆంధ్రశాసన సభ్యులు తమిళశాసన సభ్యులు పరస్పరాభినందనలు, హర్షభావము ప్రకటించిరి. 'ఆంధ్రరాష్ట్రానికి జై' అని రాయలసీమసభ్యుడొకడు ఆనందముతో ఒక సోదర సభ్యునిచూచి పరామర్శ చేసెను. మొత్తానికి ఎవరి కారణములు వారికున్నను, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ తీర్మానము చెన్ననగరములోని వివిధభాషా వర్గములను, రాజకీయవర్గములను తృప్తిపరచినది.

మద్రాసు ప్రధాని కుమారస్వామిరాజాగారిని రాష్ట్రకాంగ్రెసు తీర్మానముపై ఆంధ్రపత్రిక ప్రతినిధి సందర్శించి అడుగగా నేటి సాయంత్రం మంత్రివర్గం సమావేశమై ఒక నిర్ణయం చేయనున్నదనియు, ఈలోపల ఏమియు చెప్పలేమనియూ తెలిపిరి. లా-శాఖా మంత్రి మాధవమీనన్ గారు 'ఆంధ్రులు విడిపోతున్నందుకు తమ సంతోషమును ప్రకటించిరి. మరియొక కేరళ శాసనసభ్యుడు, ఆంధ్రులు భాషారాష్ట్ర జ్యోతిని వెలిగించి, ప్రజ్వలింపచేసి ఇతర భాషారాష్ట్ర వాదులకు మార్గగాములైనందుకు తమ హర్షాతిశయమును ప్రదర్శించిరి.

**రాయలసీమవారి సంతోషం**

మద్రాసు ప్రభుత్వ మద్యనిషేధమంత్రి నీలం సంజీవరెడ్డిగారు ఆంధ్రపత్రిక ప్రతినిధితో ఇట్లు తెలిపిరి: "వెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరుగుటవల్ల రాయలసీమవాసులు కొంత నష్టమును పొందుచున్నను ఈ సమయంలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో రాయల

(3వ పేజీ చూడుడు)

## గంటల పంచాంగం

విరోధి సం॥ కార్తీక బ॥ సప్తమి

1949 సం॥ నవం॥ 13 ఆదివారం

ఆ॥ సప్తమి ప 9-42 ఆశ్లేష రా 1-9 వర్జ్యం ప 2-2 ల 3-37 వ.

బ॥ అష్టమి నవం॥ 14 సోమవారం సో॥ అష్టమి ప 8-41 మఘ రా 12-24 వర్జ్యం ప 12-47 ల 2-20 వ.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ కార్తీక బ॥ సప్తమి

ఆదివారం

# చరిత్రాత్మక నిర్ణయం

అందరు ఆశించినట్లే, మేము విశ్వసించినట్లే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘ సర్వసభ్య సమావేశము, నాయకత్రయ నివేదికను ఆమోదించుచు రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గము గురువారము చేసిన తీర్మానమును ఏకగ్రీవముగా ఆమోదించినది. రాష్ట్ర కాంగ్రెస్ ఇట్టి మహత్తర, సముచిత నిర్ణయము చేయుటకు బాధ్యులైన వారందరు అభినందనీయులు. ప్రకాశంపంతులుగారు సర్వసభ్య సమావేశములో తీర్మానమును ప్రతిపాదించుటకు పూర్వము రాష్ట్ర కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు రంగాగారు వెల్లడించినట్లు "ఆంధ్రులు నాయకత్రయ నివేదికను ఆమోదించుటకు చెన్నపట్టణము విషయములో నాయకత్రయ సంఘము విధించిన షరతులే తీవ్ర ప్రతిబంధకముగ నుండెను." చెన్నపట్టణము విషయమున నాయకత్రయ నివేదిక విధించిన షరతుల అంతరార్థమును నాయకత్రయ సంఘ సభ్యుడును, కాంగ్రెస్ అధ్యక్షుడును అగు డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఇటీవల చేసిన విశదీకరణ ఆంధ్రులలో లోగడ ఏర్పడియున్న భయభీతులు తొలగిపోయినవని, నాయకత్రయ నివేదికను నిస్సందేహముగ అంగీకరించుట సాధ్యమైనదని రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానము ప్రకటించుచున్నది. నాయకత్రయ నివేదిక "ఆంధ్రులు వదులుకొనవలసిన హక్కులు" ఏవి యను విషయములో కొంత సందిగ్ధముగనే కన్పించును. కాని సందర్భానుబట్టి విచారించిన లోగడ మేము అనేక పర్యాయములు వివరించినట్లు రాష్ట్రనిర్మాణము సాధ్యముగావలెనన్న "నగరము ఆంధ్రరాష్ట్ర భాగము" అనువాదమును మాత్రమే ఉపసంహరించుకొనవలసియుండునుగాని, నగరముపై గల హక్కులను వదులుకొనవసరము లేదని స్పష్టము కాగలదు.

"అగ్రనాయకత్రయసూచనను విమర్శగ పరిశీలించిన 'చెన్నపట్టణము ఆంధ్రరాష్ట్రములో చేరవలెనను కోరికను ఉపసంహరించుకొనినగాని ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము సాధ్యముగాదు' అని మాత్రమే స్పష్టమగును" అని 1949 మే 4 వ తేదీన, "నగరము ఏ రాష్ట్రములో చేరినను నగరమునందున్న ఆంధ్రులకు ఇతర పౌరులకు వలెనే హక్కులుండును. వారట్టి హక్కులను ఎన్నటికిని వదులుకొనజాలరు. వదులుకొనవలెనని ఎవ్వరు చెప్పజాలరు. కనుక ఆంధ్రులు వదులుకొనవలసిన హక్కులు చెన్నపట్టణము ఆంధ్రరాష్ట్ర భాగము కావలెనన్నంతవరకేనని భావింపవలసియుండును." అని మే 11 వ తేదీన తెలిపియుంటిమి. ఇదే వివరణను రాష్ట్రనిర్మాణముపై వ్యాఖ్యానము చేయవలసిన అవసరమేర్పడిన అన్ని సందర్భములందును ఉద్ఘాటించుచుంటిమి. షణ్ముఖంచెట్టిగారివంటి ప్రతిభావంతులు ఎట్లు అన్వయము చేయ ప్రయత్నించినను, అసలు నివేదికయందలి వాక్యముల అర్థము మార్పు చెందదు.

గతములో ఏమి జరిగియున్నప్పటికిని, రాష్ట్ర కాంగ్రెస్ సంఘము మాత్రము చరిత్రాత్మకమైన నిర్ణయము చేసినది. సమావేశములో పాల్గొని, ఏకగ్రీవామోదమునకు దోహదమిచ్చిన అఖిలభారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు "రాష్ట్ర కాంగ్రెసు సంఘము జె. వి. పి. నివేదికను ఆమోదించి మన నూతన భారత రిపబ్లిక్ భాగముగ "ఆంధ్ర స్టేట్" స్థాపనకు దారి సుగమము చేసినది" అని ప్రకటించుటవలన అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గము అక్టోబరు 5 వ తేదీ తీర్మానోద్దేశ్యమునకు రాష్ట్ర కాంగ్రెస్‌సంఘ తీర్మానము అనుగుణముగ నున్నదని భావింపవచ్చును. కాంగ్రెస్ అధ్యక్షుడు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారుకూడ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ ఆమోదము లభించిన జె. వి. పి. రిపోర్టుప్రకారము ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఏర్పడగలదని ప్రకటించిరి. రాష్ట్ర కాంగ్రెసు సంఘము ఆ నివేదికను "నిస్సందేహముగ" ఆమోదించినది. ఇక ప్రత్యేకాంధ్ర రాష్ట్ర స్థాపన బాధ్యత, భారము అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గానిది; కేంద్ర ప్రభుత్వానిది. వీరు ఆ బాధ్యతా, భారముల నిర్వహించుటకు ఉపయోగపడగల సూచనలు కొన్నిటిని రాష్ట్ర కాంగ్రెసు సంఘము చేసెను. ఈ సూచనలలో ముఖ్యమైనవి ఆంధ్రరాష్ట్రము ఏ ప్రాంతములతో ఇపుడేర్పడవలెను, తమిళ, ఆంధ్రరాష్ట్రముల రాజధానులు ఏర్పడువరకు, చెన్ననగర భవిష్యత్తు నిర్ధారణ యగువరకు నగరపరిపాలన ఏవిధముగ జరుగవలెను? అను విషయములకు సంబంధించినవి. ఆంధ్ర రాష్ట్ర ప్రాంతములను పేర్కొనుటలో బళ్లారిజిల్లాను కేల్కార్ అవార్డు ప్రకారము విభజించి ఆదోని, ఆలూరు, రాయదుర్గము తాలూకాలను మిగత తెనుగు జిల్లాలను కలిపి ప్రత్యేకాంధ్రరాష్ట్రమును ఏర్పాటు చేయవలెనని రాష్ట్ర కాంగ్రెస్‌సంఘము చేసిన సూచన ఆంధ్రుల రాజనీతిజ్ఞతనుగాక ఔదార్యమును వెల్లడించును. కర్ణాటకులు సరిహద్దు విషయములో పేచీపెట్టిన, తిరిగి రాష్ట్రనిర్మాణము వాయిదా పడగలదను భయమే ఇందుకు కారణమై యుండవచ్చును. నాయకత్రయ నివేదిక చెన్నపట్టణము విషయములోనేగాక, సరిహద్దుల విషయమునకూడ కొన్ని షరతులను విధించియుండెను. ఆ షరతుల ప్రకారము నూత్నభారత రిపబ్లిక్ అవతరణతోబాటు ఏర్పడు ఆంధ్ర రాష్ట్ర సరిహద్దులు సంశ్లిష్ట ఇతర భాషాప్రాంతములవారి సమ్మతితో ఏర్పడవలెను. అందువలన రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానము 'కేల్కార్ అవార్డు' ప్రసక్తి తెచ్చియుండవచ్చును. కీడెంచి మేలెంచుట కార్యవాదుల లక్షణము గనుక, రాష్ట్ర కాంగ్రెస్ సంఘము ఇట్టి తీర్మానమును చేసియుండవచ్చును.

అన్నివిధముల రాష్ట్ర కాంగ్రెస్ సంఘము చేసిన తీర్మానము తృప్తికరముగ నున్నదని చెప్పవచ్చును. నవంబరు 10 వ తేదీ విజయవాడలో జరిగిన బహిరంగసభలో ఉపన్యసించుచు రాష్ట్ర కాంగ్రెస్ సంఘము గత జూలైలో ఆంధ్ర ప్రజా పరిషత్తు చేసిన తీర్మానమునే పునః ఆమోదింపవలెనని, అందుకు భిన్నముగ చేయుట ఆంధ్రులకు ద్రోహము చేయుటేనని అతఃపూర్వ మొక సందర్భమున ప్రకటించిన సర్ యస్. వి. రామమూర్తిగారు "ఇది చాల సంతృప్తికరమైన నిర్ణయము" అని ప్రకటించుటవలన రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానము అన్ని వర్గములను తృప్తి పరచినదని భావింపవచ్చును. ఆంధ్రులు, ఆంధ్ర నాయకులు ఇంక మీదటకూడ ఇట్టి ఐక్యతనే ప్రదర్శింపగలరని ఆశించుచున్నాము.

చెన్ననగరము విషయమునను, నూత్న ఆంధ్రరాష్ట్ర శాసనసభ, ప్రభుత్వము, చట్టములు విషయములో రాష్ట్ర కాంగ్రెస్ తీర్మానము చేసిన సూచనలు అన్నియు ఆచరణ సాధ్యములే. చెన్ననగరము కొంతకాలము ఉమ్మడి రాజధానిగ నుండకతప్పదు. అట్లున్న కాలమున నగరపరిపాలనా వ్యవహారముల నిర్వహణకు రాష్ట్ర కాంగ్రెసు సూచించినమార్గము కంటె భిన్నమైనమార్గము లేదు.

అఖిలభారత కాంగ్రెసుసంఘ కార్యవర్గము 16 వ తేదీన సమావేశమై అక్టోబరు 5 తీర్మానముపై ఆంధ్ర, తమిళ కాంగ్రెసుసంఘములు, చెన్నరాష్ట్రప్రభుత్వము వెల్లడించు అభిప్రాయములను పరిశీలించి ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకవసరమైన చర్యలను నిర్ణయించును. ఆ నిర్ణయము చేయునపుడు కార్యవర్గమువారు రాష్ట్ర కాంగ్రెసు తీర్మానమునందలి సూచనలను ప్రత్యేకశ్రద్ధతో పరిశీలించవలసియుండును.

జనవరి 26 న స్వతంత్ర భారత రిపబ్లిక్ అవతరణతో ప్రత్యేకాంధ్ర రాష్ట్రముకూడ ఏర్పడగలదు. రాష్ట్రనిర్మాణమున కీవిధముగ దోహదము చేసిన తీర్మానమును చేసినందుకు రాష్ట్ర కాంగ్రెస్ సంఘసభ్యుల నందరిని మరొక పర్యాయము అభినందించుచు, రాష్ట్రనిర్మాణము, రాష్ట్ర అభివృద్ధి సాధనలో ఆంధ్రులందరు ఐక్యకృషి చేయవలెనని నిన్న చేసిన విజ్ఞప్తిని తిరిగి చేయుచున్నాము

# బ్రిటన్ స్టర్లింగ్ బాకీ చెల్లింపు

## క్రమేణా అభివృద్ధి: క్రిప్స్ ప్రకటన

లండన్, నవంబరు 11: బ్రిటన్ ఆయా దేశాలకు యివ్వవలసిన స్టర్లింగుబాకీ మొత్తాలను క్రమేణా ఎక్కువగా విడుదల చేస్తున్నట్లు యివ్వాళ ఖజానామంత్రి సర్ స్టాఫర్డుక్రిప్సు పార్లమెంటులో తెలిపిన అంకెలను బట్టి తెలుస్తున్నది. 1949 సంవత్సరం మొదటి 9 నెలల్లోనూ, 20 కోట్ల 60 లక్షల పౌనులు విడుదల చేసినట్లు స్టాఫర్డుక్రిప్సు తెలియజేశారు. అంటే యేటా 27 కోట్ల 50 లక్షల పౌన్లు చొప్పున విడుదల అవుతున్నవన్నమాట.

గత సంవత్సరం, స్టర్లింగ్ బాకీ విడుదల మొత్తం 25 కోట్ల 70 లక్షల పౌన్లు. 1947 లో 15 కోట్ల 60 లక్షల పౌనులు.

# రాష్ట్రనిర్మాణానికి సంపూర్ణావకాశం

(1 వ పేజీ తరువాయి)

రోజు. ఆంధ్ర ప్రజాభిప్రాయానికి అత్యంత ప్రాతినిధ్యం వహించే ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం జె. వి. పి. రిపోర్టును ఆమోదించి, నూతన భారత రిపబ్లిక్‌లో అంతర్భాగంగా ఆంధ్ర ప్రభుత్వం ఏర్పడేందుకు మార్గం సుగమం చేసింది. కాంగ్రెసు కార్యవర్గం కోరినట్లు ఆంధ్రులు చెన్నపట్నం ఆంధ్రరాష్ట్రంలో భాగంగా ఉండాలనే హక్కును వదులుకొన్నారు. చెన్నపట్నం ప్రత్యేక పరిపాలిత ప్రాంతంగా ఉండాలా అన్నదానిని భారతప్రభుత్వం రాగద్వేష రహితంగా ఆలోచించవలసిన అంశం. ఆం. రా. కాం. సంఘం అంతవరకూ తన హక్కును నిలుపుకొన్నది. ఈ విషయమును, అందుకు సంబంధించినవారు, న్యాయమైనమార్గంలో పరిష్కరిస్తారని నా విశ్వాసం.

### శొంఠి రామమూర్తిగారు

శ్రీ శొంఠి వెంకటరామమూర్తిగారు తీర్మానం చాలాతృప్తికరమైన నిర్ణయమనీ, ఇది ఏకగ్రీవంగా ఆమోదింపబడడం ఆనందదాయకమనీ అన్నారు.

### గు. వెం. పున్నయ్యశాస్త్రిగారు

ఆంధ్రమహాసభ ప్రధానకార్యదర్శి గుళ్ళపల్లి వెంకటపున్నయ్య శాస్త్రిగారిలా వ్రాశారు: ఆం. రా. కాం. సంఘం నిర్ణయం అద్భుత రాజనీతిజ్ఞతను కనపరుస్తున్నది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ఇక నిశ్చయంకనుకనూ, నూతనరాజ్యాంగానికన్నా కూడా ముందే అది ఏర్పడవచ్చు కావునా, ఇకమనం ఆంధ్రరాష్ట్రానికి సంశ్లిష్టంగావుండే తెలంగాణా, మైసూరు బస్తరు, సి. పి. లలోని తెలుగుజిల్లాలతో కూడిన విశాలాంధ్రనిర్మాణానికి కృషి చేయవలెను. ఒరిస్సాలో కలిసిపోయిన ఆంధ్రప్రాంతం తిరిగిపొందడానికికూడా ఆందోళనన్నధికంచేయాలి.

ఆంధ్రప్రముఖులలో ఇప్పుడుఏర్పడిన ఐకమత్యం ఇకముందుకూడా ఉండవలెననీ, ఏర్పడబోవు ఆంధ్రరాష్ట్రం, నాలుగు దశాబ్దాల వాంఛాఫలసిద్ధికి ప్రయోజన పడవలెననీ భగవంతుని ప్రార్థిస్తున్నాను

# రాయలసీమ పట్ల విశేషాదరణ

(1 వ పేజీ తరువాయి)

సీమ సర్కారు సోదరులు ప్రదర్శించిన ఏకమనస్కత, స్నేహభావము, సామరస్యము ప్రశంసనీయమైనవి. రాష్ట్ర కాంగ్రెసు సమావేశములో రాయలసీమ సోదరులయెడ ఆదరాతిశయముల వర్షింపజేసిరి. రాష్ట్రము ప్రాప్తించినతోడనే రాయలసీమ ఆర్థికాభివృద్ధికి ఈ ఆదరమంతయు వినియోగపడునని ఆశించుచున్నాను.

శ్రీబాగ్ ఒడంబడికను పాలింతునని కోస్తా నాయకులు పునరుద్ఘాటన చేయుట ముదావహము. రాష్ట్రము వచ్చినమీదట ఈ షరతులు పాలింపబడునని నేను ఆశించుచున్నాను. రాష్ట్ర కాంగ్రెసు నాయకత్రయ నివేదికను ఆమోదించి రాష్ట్ర నిర్మాణమును సులభము చేసినందుకు అందరూ సంతోషిస్తున్నారు."

### డా॥ పట్టాభి సమయోచితమైన ప్రజ్ఞా ప్రశంస

ఆంధ్ర వాణిజ్య సంఘాధ్యక్షులు, చెన్నపట్నం, నియోజకవర్గ శాసనసభ్యులు అయిన సుంకూరు నరసింహారావుగారు ఇటుల తెలుపుచున్నారు:- "ధిషణాధురంధరులు, అశేష ప్రజ్ఞాన్వితులూ అయిన మన రాష్ట్రపతి డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు నాయకత్రయ నివేదికను చక్కని వ్యాఖ్యానము చెప్పి ఆంధ్రజాతి సంతతిని ఒక్కత్రాటిపై ఈ క్లిష్టసమయమున నడిపించగలిగినందుకు ఆంధ్రజాతి అంతయూ వారికి ధన్యవాదము లర్పించుచున్నది. ఎన్నాళ్ళుగానో ఏర్పడియున్న ఆ నిశ్చయ వాతావరణం మేఘములు నేడు తొలగిపోయి ఆంధ్రరాష్ట్ర అవతరణకు ప్రశాంత పరిస్థితి కల్గినది. ఆంధ్రరాష్ట్ర అవతరణతో ఆంధ్రమహాజనులు అష్టైశ్వర్యాలు, వర్తక వాణిజ్యాది పరిశ్రమలు, వృద్ధిఆయి, ఆంధ్ర ప్రాశస్త్యము ఫలించి, ఆంధ్రదేశము సస్యశ్యామలము గాగలదని ఆశించుచున్నాను.

బెజవాడలో గావించిన నిర్ణయం చెన్నపట్నంలోని ఆంధ్రులను, రాయలసీమ ఆంధ్రులను, కోస్తా ఆంధ్రులను, తెలంగాణా ఆంధ్రులను విశాలాంధ్రావనియందున్న ఆంధ్రులందరిని సంతోషాంతరంగులచేయగలదని, ఆశించుచున్నాను."

### రాయలసీమ సర్కార్ల సౌహార్దత

స్థానిక శాఖామాత్యులు కల్లూరి చంద్రమౌళి గారు ఇట్లు తెలుపుచున్నారు:— "నిన్న విజయవాడలో వెల్లివిరిసిన ఏకీభావం వేనోళ్ల కీర్తింపదగినది. ఆంధ్రులైన వారందరూ నిన్న జరిగిన నిర్ణయమునకు ఆనందించి తీరవలెను. రాయలసీమ, సర్కారుల వాసుల సౌహార్దతకు సోదర స్వభావమునకు, స్నేహభావమునకు ఇది ప్రబలమైన తార్కాణము."

# తుఫానువల్ల దేశానికి ఘోరమైన నష్టం

## పత్రికల వార్తలు అతిశయోక్తులు కావని రివెన్యూబోర్డుసభ్యుని నివేదిక

మదరాసు, నవంబరు 12: "ఆంధ్ర జిల్లాలలో తుఫాను గూర్చి పడిన వార్తలు అతిశయోక్తులు కావు. యథాస్థితిని బాగుగ తెలిపినవి" అని ఎస్. రంగనాథంగారు, రివెన్యూబోర్డు సభ్యులు నిన్న విలేఖరులతో ప్రసంగించుచు తెలిపిరి. వీరును యితర సభ్యులును ఆ ప్రాంతాలు చూచి వచ్చిరి. "విపరీతమయిన నష్టం కలిగింది. రివెన్యూబోర్డువారు సమావేశమయి యీ వివరాలన్ని చర్చించి, ఎంతవరకు సహాయ కార్యం జరిగిందో యింకా ఎంత చేయవలసియున్నదో చర్చించి, ప్రభుత్వానికి శిఫార్సులు పంపిరి. వాటి వివరాలు శాసన సభ్యులకు తెలుపబడును" అని రంగనాథంగారు నుడివిరి.

"సర్కారు జిల్లాలందు ఎంతనష్టం కలిగిందో సరిగా చెప్పుటకు యిప్పుడప్పుడే వీలులేదు" అని సి. విజయరాఘవనుగారు బోర్డు సభ్యులు నుడివిరి. వీరును ఒక వారంరోజులు ఆ ప్రాంతాల సంచారం చేసి వచ్చిరి:

నష్టం చాలా కలిగింది కాని అందుకు తగిన పరిహారం చేయవచ్చును. నర్సాపూరు, అమలాపూరు, రాజోలు తాలూకాలకు ఎక్కువ నష్టం కలిగింది. 12 నుండి 15 అడుగుల ఎత్తున లేచిన ఉప్పెన కెరటం నాలుగైదు మైళ్లు భూప్రదేశంలోనికివచ్చి ముంచేసింది. ఇండ్లకు గుడిసెలకు చెరుకు అరటితోటలకు, పశువులకు గొర్రెలకు కలిగిననష్టం యింతంత గాదు." అని విజయరాఘవనుగారనిరి.

ఆ ప్రాంతాల ధాన్యసేకరణ నిలుపు చేయుదురాయని అడుగ యిపుడు చెప్పలేననియు, ప్రతితాలూకాకు ప్రత్యేకోద్యోగులను నష్టప్రమాణము తెలుసుకొనపంపితిననియు, నుడివిరి.

వ్యవసాయశాఖ డైరక్టరుగారు, ఆదివారంనాడు ఆంధ్రజిల్లాల సంచారమునకు బయలుదేరుచున్నారు. సర్కారులందు యీ యేడు అత్యధికంగా పండునని అంచనా వేయగ యిట్లుజరుగుట చాలదురదృష్టమనిరి. సుమారు 5 లక్షల ఎకరాలలో పంటపూర్తిగా పోయియుండును. చులకసపంట కోతలయిపోయినాక యీ తుఫాను రావడం కొంతమేలనిరి. దక్షిణజిల్లాల నుండి విత్తనాలధాన్యం తెప్పించి సర్కారులందు పంచిపెట్టెదమనిరి. తిరిగి సాగు డిశంబరు లేక జనవరిలో ప్రారంభింపవచ్చుననిరి.

# "రాయలసీమకి భయం లేదు"

కె. వరదాచారి (ఎం. ఎల్. ఏ.) గారు ఇటుల తెలుపుచున్నారు. "నిన్న విజయవాడలో జర్గిన ఆంధ్ర రాష్ట్ర విజయమునకు నేను పరమానంద భరితుడనైతిని. అందున ఆంధ్ర కేసరి ఆ తీర్మానమునకు ప్రతిపాదకులగుటయు, రామమూర్తి వంటి వారి ఆశీర్వచనము లభించుటయు నాకు బ్రహ్మానందమైనది. చెన్నపట్నములో ఆంధ్రుల సంబంధ బాంధవ్యములను, వర్తక వాణిజ్యాదికములను ఎన్నడును, ఎపుడును ఆపలేరు. ఇంతవరకు ఆంధ్రులు చెన్ననగర రాజకీయములందెంతటి ప్రధాన పాత్ర వహించినారో ఇక ముందు గూడా ఇతోధిక కృషి చేయగలరు. రాయలసీమ వారెవ్వరూ యీ నిర్ణయమునకు వ్యసన పడలేదు. తమ నెవ్వరో అణగ ద్రొక్కెదరని శంకించ నవసరములేదు. శ్రీ బాగ్ ఒడంబడికవంటి షరతులను పట్టుకొని ప్రాకులాడ నవసరం లేదు. రాబోవు ఆంధ్రరాష్ట్రమున రాయలసీమ నెల్లూరు మండలములవారు సర్కారులతో సమముగా తూగగలరు. తమమాట చెల్లునట్లు చేసుకొనగలరు. రాయలసీమవారు సర్కారులకన్న లోగడ అనుభావములు మాత్రము తెలిసి చేయవలెను. రాయలసీమకు అన్యాయము జరుగగలదను దుష్ప్రచారకుల వలలో రాయలసీమవారు పడరాదు. సత్వరాంధ్రరాష్ట్రము రాయలసీమాంధ్రులను, కోస్తాంధ్రులను సౌభాగ్య సంపదలతో అలరారునట్లు చేయగలదు."

# రష్యా శాంతికే పరితపిస్తున్నది

(1-వ పేజీ తరువాయి)

మానవజాతి యుద్ధాన్ని మనసారా ద్వేషిస్తున్నదనీ, యుద్ధబీజాలను మొలకలో ఉండగానే తుంచివేయాలని ప్రపంచం ఆరాటపడుతున్నదనీ, జనరల్ అసెంబ్లీకి నచ్చచెప్పడమే రష్యన్ ప్రతినిధివర్గం యొక్క ప్రధానలక్ష్యం". అమెరికా రష్యాల సామరస్య సంఘాన్ని అమెరికన్ ప్రభుత్వం దేశవిరోధ సంస్థల జాబితాలో చేర్చింది. ఈ సంఘంయొక్క ఈ "దేశ విరోధిత్వాన్ని" తాను హర్షిస్తున్నానని విషిన్స్కీ అనెను.

విషిన్స్కీ సమావేశంలో చదవడానికని వ్రాసి తెచ్చిన ఉపన్యాసంలో ఇదంతా ఏమిటేమ; అమెరికాను మాత్రం అటంబాంబులు నిలవ చేసుకోనిచ్చి, ఇతరత్ర ఆటంబాంబులు ఉత్పత్తికాకుండా అరికట్టాలని పాశ్చాత్యదేశాలు ఉద్దేశిస్తున్నవనీ, ఇదెటువంటి నెలవిగల ఎత్తు గాని రష్యా ఇది కనిపెట్టలేదనుకోవడం హాస్యాస్పదం అనీ, లిఖితపాఠంలో వ్రాసివున్నది.

# ఆంధ్ర విశ్వవిద్యాలయం

## పరీక్షా ఫలితాలు

ఇటీవల జరిగిన పరీక్షల్లో ఈ క్రింది వారు ఉత్తీర్ణులైనారు.

### బి. టి. డిగ్రీ

2 వ తరగతి: 3 26 28 51 66.

3 వ తరగతి: 1 2 4 నుండి 18 20 2 29 32 34 నుండి 37 39 నుండి 41 43 4 నుండి 49 54 నుండి 57 59 60 62 నుం 65 69 70 72 74 నుండి 77.

### ఎఫ్. ఎల్. పరీక్ష

2 వ తరగతి: 118 120.

3 వ తరగతి: 1 నుండి 5 11 15 16 21 27 31 34 37 38 43 44 50 53 54 58 60 68 76 78 83 85 92 99 106 109 110 112 114 116 117 119 137 141 147 149 150 152 157.

### బి. ఎల్. డిగ్రీ

2 వ తరగతి: 296 మాత్రం.

3 వ తరగతి: 159 160 162 167 168 173 నుండి 175 178 186 189 నుండి 191 194 195 201 203 205 206 213 218 220 నుండి 223 225 228 నుండి 230 232 235 241 243 246 నుండి 250 252 253 255 నుండి 259 261 262 264 267 268 271 275 276 278 281 నుండి 283 285 287 289 295 300 301 306 311 313 315 318 320.

ఈ దిగువనంబర్లుగలవారు భాగాలుగాను తీర్ణులయి పూర్తిచేసిరి. 169 199 310 312.

# ప.గో. జిల్లా కాంగ్రెసు కార్యవర్గంపై రాష్ట్రకాంగ్రెసు క్రమశిక్షణచర్య

## ఏలూరుకు ప్రత్యేకాధికారి రాక

ఏలూరు, నవంబరు 9: పశ్చిమగోదావరి జిల్లా కాంగ్రెసు సంఘమునకు ప్రత్యేకాధికారిగా నియమింపబడిన ఇ. శివమూర్తిగారు గత సాయంకాలం యిచటకు వచ్చి కాంగ్రెసు కార్యాలయమునకు వెళ్లిరి. కార్యాలయములో అధ్యక్షుడుగాని, కార్యదర్శులుగాని లేనందున, శివమూర్తిగారు రాష్ట్ర కాంగ్రెసువారు జిల్లా కాంగ్రెసు కార్యవర్గముపై తీసికొన్న చర్యను, కార్యాలయ కార్యదర్శిగారికి వివరించి, అందుకు సంబంధించిన కాగితములు వారికందజేసిరి.

తరువాత శ్రీ శివమూర్తిగారు ఏలూరునందలి ప్రజాహిత జీవితములో ప్రముఖులగువారిని కొందరిని కలసికొనిరనియు, వారు రాష్ట్ర కాంగ్రెసు సంఘమువారు జిల్లా కాంగ్రెసు కార్యవర్గముపై తీసికొనిన చర్య నామోదించుచూ, కాంగ్రెసు యందు క్రమశిక్షణ అత్యావశ్యకమనియు, క్రమశిక్షణ కాపాడుటకవసరమైన చర్యలు గైకొనుట యుక్తమేననీ అభిప్రాయపడిరని శివమూర్తిగారు తెల్పిరి. వారీ దినము బెజవాడ వెళ్ళిపోయిరి.

# జర్మనీ యంత్రోద్వాసన సమస్య

పారిసు, నవంబరు 11: జర్మనీలో యంత్రోద్వాసన విధానంలో మార్పు తీసుకురావాలన్న విషయాన్ని గూర్చి అమెరికా, బ్రిటన్ ఫ్రాంసు హైకమిషనర్లు విచారిస్తారని తెలుస్తున్నది.

వీరు ఫ్రాంసులో జరిగిన అగ్ర రాజ్యత్రయ విదేశాంగమంత్రుల సమావేశానికి వెళ్ళి ఇవ్వాళే తిరిగివచ్చారు.

ఈ సమావేశంలో ఆముగ్గురు విదేశాంగ మంత్రులుతమ తాలూకు కమిషనర్లకు ఈ విషయాన్ని గూర్చి కొన్ని ఆదేశాలు ఇచ్చినట్లున్నూ, ఈ ఆదేశాల ప్రాతిపదికగా 2, 3 రోజుల్లో పశ్చిమ జర్మనీ ప్రధాన మంత్రి డా॥ కానరాడ్ ఆడానర్‌తో సంభాషణలకు దిగనున్నట్లున్నూ తెలుస్తున్నది.

# ఆగ్నేయాసియారాజ్యసమాఖ్యలో ఐక్య ఇండోనీషియా చేరుతుంది

## రిపబ్లికన్ ప్రధాని హట్టా అభిభాషణ

రంగూను, నవంబరు 11: హేగ్ రౌండుటేబిలు సమావేశంలో రిపబ్లికను ప్రతినిధివర్గ నాయకుడుగా వ్యవహరించిన రిపబ్లికు ప్రధాని డా॥ మహమ్మదు హట్టా భార్యాసమేతంగా హేగ్‌నుంచి తిరిగిపోతూ ఇక్కడికి వచ్చారు.

శాంతి, సమానత్వం, పరస్పరసహకారం ప్రాతిపదికగా ఆగ్నేయాసియారాజ్యాలయూనియను ఏర్పడితే అందులో ఇండోనీషియా సంయుక్త రాష్ట్రాలు తప్పక చేరగలవనీ, ఆ యూనియనులో ఏ దేశంగాని మరొకదేశంపై అధికారం చలాయించరాదనీ, పీడిత ఆసియాప్రజలందరి స్వాతంత్ర్యమూ ఆశయంగా ఉండాలనీ, భద్రతా సంతృప్తులుగల ప్రజానీకంలో కమ్యూనిజమునకు తావుండరాదనీ ఆయనఅన్నారు.

జాతీయ క్షేమానికి భంగం కలగని పరిస్థితులలో విదేశీ పెట్టుబడులు స్వీకరిస్తామనీ ఇండోనీషియా సహజ సంపద అభివృద్ధి చేయడానికి అటువంటి పెట్టుబడులు అవసరమనీ ఆయన వివరించారు.

డా. హట్టా బర్మాప్రధాని థాకిన్‌నూతో అనధికారచర్చలు జరిపి రేపు ప్రభుత్వంవారు ఏర్పాటుచేసే విందులో పాల్గొంటారు. రేపురాత్రి బర్మా అధ్యక్షుడు సావ్ శ్వేథాయికే ఆతిథ్యం స్వీకరిస్తారు.

# ఎరిట్రియా భవిష్యత్తు

## పోలిష్ ప్రతిపాదనకు రాజకీయ నిరాకరణ

లేక్‌సక్సెస్, నవంబరు 11: మూడేండ్లలోగా ఎరిట్రియాకు స్వాతంత్ర్యమివ్వాలని, యీలోగా దానిని, ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వపాలనక్రింద ఉంచాలని, పోలండ్ ప్రతిపాదించిన తీర్మానాన్ని ఐక్యరాజ్యసమితి రాజకీయసంఘం యీ రాత్రి నిరాకరించింది. పోలిష్ ప్రతిపాదనను నిరాకరిస్తూ, ఎరిట్రియా భవిష్యత్తు నిర్ణయించుటకు ముందుగా ప్రజాభీష్టాన్ని తెలుసుకొనుటకు, ఐదురాజ్యాల ప్రతినిధులతో ఒక కమీషన్‌ను నియోగించాలని, సమితి రాజకీయసంఘం నిర్ణయించింది. ఈ నిర్ణయతీర్మానానికి అనుకూలంగా 40 ఓట్లు ప్రతికూలంగా [illegible] ఓట్లు వచ్చినవి. 9 మంది ప్రతినిధులు ఓటింగ్‌లో పాల్గొనలేదు. ఈ కమీషన్‌లో దక్షిణాఫ్రికా, గోటమాలా, పాకిస్థాన్, నార్వే, బర్మా ప్రతినిధులు ఉంటారు.

ఈ కమీషన్ నియామకం విషయంలో సోవియట్ రష్యా తదుపక్షరాజ్యాలు తీవ్రంగా ప్రతిఘటించాయి. పోలిష్ తీర్మానాన్ని బలపర్చాయి.

# ఆంధ్రరాష్ట్ర సత్వరప్రాప్తి: విజయవాడ సభలో రాష్ట్ర నాయకుల ఉద్బోధ

## దుర్గాకళామందిరంలో ఆంధ్రకాంగ్రెస్ సర్వసభ్య సమావేశం

### తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ ప్రకాశం పంతులుగారి ఉపన్యాసం

### గత మూడు సంవత్సరాల సంఘటనలు: రంగాగారి సమీక్ష

[ ఆంధ్రపత్రికవిలేఖరి ]

బెజవాడ, నవంబరు 11: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ చరిత్రాత్మక సమావేశం నేడు మధ్యాహ్నం 3½ గంటలకు దుర్గా కళామందిరములో ప్రశాంతమైన వాతావరణంలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులు శ్రీ ఎన్. జి. రంగాగారి అధ్యక్షతను సమావేశమయ్యెను. ఎన్. జి. రంగాగారు రాష్ట్ర తీర్మాన ప్రతిపాదనకు పూర్వము ఇటుల ఉపన్యసించిరి: "ఆంధ్రులు చిరకాలంగా ఆందోళన జరుపుతూన్న ఆంధ్రరాష్ట్రము విషయమై శాశ్వతంగా కూడుకున్న నిర్ణయమును చేయుటకు మనము సమావేశమైనాము. ఆంధ్రుల వలెనే దేశంలో ఇంతరులు కూడా చిరకాలమునుంచి ప్రత్యేక రాష్ట్రాలను వాంఛిస్తున్నారు. కానివారు ప్రభుత్వాన్ని వత్తిడి చేసి, ఆశ్రయించి రాష్ట్రాన్ని సంపాయించు కున్నారు. ఆంధ్రులు మొదటినుంచీ రాష్ట్రముల ఏర్పాటు చేసుకొను ప్రసక్తి వచ్చినప్పుడల్లా మొదటశాసనసభలు బహిష్కరముచేసి, తదుపాత సైమన్ కమిషను వచ్చినపుడు సైమను కమిషన్ను బహిష్కరించినందున రాష్ట్రముఠాకుండా పోయింది. స్వాతంత్ర్యం వచ్చాక రాష్ట్రము విషయంలో పట్టుదలచూపి ఆందోళనచేయ ప్రారంభించారు. కాంగ్రెసు ప్రభుత్వాలు వచ్చాక ఆందోళన హెచ్చయింది. అందులో స్వరాజ్యంరాగానే తొందర కలిగింది. రాజ్యాంగ నిర్మాణసభ ప్రారంభానికి ముందే ఢిల్లీలో భాషా రాష్ట్రవాదుల పరిషత్తును పట్టాభిగారు ఏర్పరిచారు. ఆ విషయంరాజ్యాంగలో వచ్చినపుడు మహారాష్ట్రులు దేశంలో అన్ని భాషారాష్ట్రాల విషయము తీర్మానము పెట్టారు. దానికి సంబంధించిన కమిటీలో ఆంధ్రులు ఎక్కువగా ఉండుట తటస్థించింది. అందుచేత పెద్దలు కొందరు ఆంధ్రులకు పట్టుదల ఎక్కువగా ఉన్నట్లుగా కనిపిస్తున్నదే అన్నారు.

మహారాష్ట్రులకు,కర్నాటకులకు రాష్ట్రము ఏర్పాటుచెయ్యడానికి అవకాశము తక్కువగా ఉన్నది. వీరికి మైసూరు బొంబై అడ్డువచ్చినయి. ఆంధ్రులకు మాత్రము రాష్ట్రము ఇవ్వవచ్చును, అని పెద్దలు ఆలోచించారు. అక్కడి ప్రముఖులు కొందరు నెహ్రూవద్దకు రాయబారంకూడా నెరపారు. వారుఆంధ్రులకు రాష్ట్రము ఇవ్వడానికి అభ్యంతరం కనపడుటలేదని విచారణ చేయిస్తామనీ హామీ ఇచ్చారు. వర్కింగుకమిటీలో ఆ విషయము వచ్చినప్పుడు కమిటీని ఎవరు ఏర్పరచాలనే ప్రశ్న కల్గింది ప్రధానమంత్రి ఏర్పరిస్తే గవర్నమెంటుకుగూడా బాధ్యత వుంటుందిగనుక రాజ్యాంగపరిషత్తు ఏర్పరచాలని నిశ్చయించారు. తరువాత థార్ కమిషన్ను రాజ్యాంగపరిషత్తు ఏర్పాటు చేసినది. వారి నివేదిక అందరికీ తెలిసినదే. అది మనకు నచ్చలేదు. అందులో వి ఎన్. రావుగారు ఒక సలహా ఇచ్చారు. అదీ మనము ఒప్పుకోలేదు. థార్ కమిషను నివేదికవల్ల మనకు నూత్న సమస్య వచ్చింది. కాంగ్రెసు నూత్న రాజ్యాంగంలో భాషా సిద్ధాంతాల ప్రకారం రాష్ట్రాలనునిర్మాణంచేస్తామని వాగ్దానము చేసింది. థార్ కమిషను అది వీలులేదు అన్నది. అందువల్ల జయపూర్ లో నాయకత్రయ సంఘ నియామకం వచ్చింది. వారు అన్నీ ఏర్పాటుచేసి, నివేదిక తయారు చేశారు. అందులో రాష్ట్రపతి పట్టాభి సీతారామయ్యగారు, భారత ప్రధానమంత్రి, ఉపప్రధాని సభ్యులై ఉన్నారు. ఇంతకన్న మనకు పెద్దలులేరు. వారు చెప్పినదాన్ని నిరసించడము సాధ్యముకాదని చెప్పలేకపోయినా సవ్యలేకాదనిమాత్రము అనవచ్చు. వారితో మనము వాదించవచ్చు. చెప్పలేనివచ్చు కాని వారు చివరకు ఒక నిర్ణయమునకు వస్తే మనము దాన్ని అంగీకరించక వీలులేదు. తరువాత, పట్టాభిగారు, వెంకట్రావుగారు నేనూ వర్కింగుకమిటీలో ఉన్నాము. మేము ఆంధ్రులయొక్క అభిప్రాయాన్ని బాగా గ్రహించి కార్యవర్గములో ఎంతవరకు చేయాలో అంతవరకూ చేశాము. ప్రకాశంగారుగూడా బయటనుండి కృషి చేస్తున్నారు. కాని భారత రాజకీయాలు నిత్యంగా పెట్టుకున్న పెద్దలు అందరినీ వారి భారత సమస్యలదృష్ట్యా విచారిస్తారు. బొంబై సంగతి తేలకుండా మహారాష్ట్రము ఏర్పాటు వీలుకాదు. మైసూరు సంగతి తేలకుండా కర్నాటకము ఏర్పడటానికి వీలులేదు. మనకు అడ్డు ఉన్నదల్లా మద్రాసు ఒక్కటే. అందుచేత ఆంధ్రరాష్ట్రము ఏర్పాటు చేస్తాముకాని రాష్ట్రము విషయంలో ఏమీ విభేదాలు తగాదాలు లేకుండా ఉంటేనే రాష్ట్రం ఏర్పాటు చేయడానికి వీలు అవుతుందని పెద్దలు అన్నారు. ఒక మద్రాసు విషయం మినహాయిస్తే మనకు ఇతరులవలె అడ్డువచ్చే సమస్యలే లేవు. ఈ సౌకర్యం ఇతరులకు లేదు. హైదరాబాదు విషయంలో కూడా ప్రస్తుతం మూడుముక్కలుగా అవడంగాని అసఫ్ జాహి వంశానికి చెందిన నిజాం తొలగడముగాని ఇప్పుడు సంభవం కాదు. ఈ విషయమై ఆశ పెట్టడానికి వీలులేదు.

తర్వాత రంగాగారు రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గం, సామాన్యసభ సమావేశం, ఆంధ్ర ప్రజాపరిషత్తు సమావేశ చరిత్ర, తీర్మానాల గాథలను వివరించిన మీదట ఇలా చెప్పిరి: "ప్రజాపరిషత్తు తీర్మానాన్ని పెద్దల కెరుకపరచడానికి శ్రీ రామమూర్తిగారు నాయకత్వం వహించారు. ఈ రాయబారవర్గాన్ని రాష్ట్ర కాంగ్రెసు సంఘమే ఏర్పాటుచేసినది ఆసందర్భమున మేము చెప్పినదంతా నెహ్రూ ఒప్పుకున్నాడా అనిపించింది. కాని తరువాత జర్గిన సంఘటనలను బట్టి ఒప్పుకోలేదని తెలిసింది. వర్కింగు కమిటీలోగూడా యుద్ధం జరిగింది. కాని మననాయకులు అని మనము అనుకున్నవారు కడకు ఖండితముగా ఒక నిర్ణయం చెప్పిన తరువాత అంగీకరించడం మన కాంగ్రెసు ధర్మము. అందుచేత నేను అంగీకవలెననే బయటకి వచ్చా బయట ప్రకాశంగారు ఉన్నారు. ఈ విషయమై వారికి ఈసారి ఏమీ నచ్చలేదు. కాని వారి ప్రకటనచూడకముందే ఎవరూ ఎలాంటి ప్రకటనలూ చేయరాదని నేనొక ప్రకటన చేశాను.

తరువాత పట్టాభిగారు మద్రాసు వచ్చారు. వారితో చేసిన, ఆలోచనలు చర్చించిన సమస్యలు, వారు చేసిన ఉపన్యాసములు పత్రికలలో ప్రకటించబడినవి. ఎప్పుడైతే పట్టాభిగారు మనకు రాకపోయినా అరవలకు పోయేది లేదనీ, మద్రాసు పరిసర ప్రదేశాలూ, ప్రత్యేక రాష్ట్రం కావాలని అన్నారో అప్పుడు ఈ విషయంలో మన అభిప్రాయాలు మార్చుకొనవలసి వచ్చింది.

ప్రకాశం గారు గూడా ఈ విషయం ఇదివరకే చెప్పి ఉంటే బాగా ఉండేది అని అన్నారు. మేమంతా బాగా ఆలోచించాము. శ్రీ కళా వెంకట్రావుగారు గూడా ఆలోచనల్లో పాల్గొన్నారు ఈ విధంగా మనము నేనుటిపంథా మార్చి ఈ తీర్మానము ఆమోదించాలి. మీరు పెద్దలు అనుకున్న వారంతా ఈ తీర్మానము అంగీకరించవలెనని అనుకున్నప్పుడు, అన్నప్పుడు మీరంతా దీన్ని ఏకగ్రీవంగా అంగీకరించాలి. మెజారిటీ మైనారిటీ భావము లేకుండా మనమిపగల బాధ్యతను మీరంతా సత్తించి ఈ తీర్మానాన్ని ఆమోదించాలని కోరుతున్నాను."

రంగాగారు ఉపన్యసించిన అనంతరం గిరి రాత్రి కొన్నివర్గం ఆమోదించిన తీర్మానమును శ్రీ ప్రకాశం పంతులుగారు ప్రతిపాదించిరి.

ఆనాడు రంగాగారు మాట్లాడుతూ "మనకు ప్రాణ్యులు, మన పెద్దలు అయిన ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశం పంతులుగారిని తీర్మానము ప్రవేశ పెట్టగోరితి.

#### శ్రీ ప్రకాశంగారి ప్రసంగం

కే జయజయ ధ్వానముల మధ్య శ్రీ ప్రకాశం పంతులు గారు ఇట్లు చెప్పిరి: మనమంతా మహాత్ముడు పెట్టిన వరవడిలో నడుచువారము. మహాత్ముడు మనకుపఖ్యాతిగూర్చిన ప్రాముఖ్యతను ఉద్బోధించిరి. అదేభావములో నేడు మన ముఖ్యరాజకీయ పరిపాలనకూడ జరుగుచున్నది. కాని మన రాష్ట్రములో స్థితి చెల్లాచెదరై నడిచేవారు, నడిపేవారు లేకుండాపోయినారు. ఆంధ్రులకు ఇప్పుడు విషమపరీక్ష, మహావిపత్తు వచ్చిపడినవి. ఈ తుపాను నష్టమును ధరించుటకు ఏ ఒక్కరి వల్లా అయ్యేపనికాదు. ప్రజలు వారికి వారే ఓదార్చుకొనవలెను. సరిగా రాష్ట్ర నిర్మాణము సుముఖముగా వున్న సమయము వచ్చినది. 30 ఏండ్ల క్రిందట దేశభక్తుడు నాటిన ఈ బీజము మహావృక్షమై ఫలవంతము కానున్నది. పర్లాకిమిడి రాజాగారి కృషి ఫలితముగా ఒరిస్సారాష్ట్రము ఏర్పడినది. ఏపాపము ఎరుగని ఆంధ్రులు నానాబాధలు పడుచున్నారు. 1947 నవంబరు 27 న పండిత నెహ్రూ భారత శాసనసభలో రంగాగారి ప్రశ్నకు జవాబు ఇచ్చుచూ 'ఇది భాషారాష్ట్రముల విభజనకు అనువు కాదని' ఆంధ్రరాష్ట్రమును మాత్రము విడదీయవచ్చని చెప్పిరి. మనం వుత్సాహపడ్డాం. కాని ఒక్క ఆంధ్రులపేరు మాత్రమే చెప్పగా మిగిలినవారు "మాకూ కావాలి. లేకుంటే శాసనసభల నుంచి రాజీనామాలు ఇస్తామని ప్రకటించిరి" అయినా తన ప్రకటనను అమలుజరుపుటకు నెహ్రూ పండితుడు సంకల్పించిరి. పండిత నెహ్రూ అనవసరము పట్టుదల పెట్టుకొనే వ్యక్తి గాదు. విశాలహృదయుడు. తరువాత సేను సర్ బి. యన్. రావు, డా॥ అంబేద్కర్ లతో మాట్లాడినప్పుడు "అయిందయ్యా ఒకటవ షెడ్యూలులో ఆంధ్రరాష్ట్రమును చేర్చాం" అన్నారు. తరువాత ఎట్లానుటు మాయమై పోయిందో పోయింది "మనకు అంతా అక్షరతః నడుచుకోవాలనే న్యాయవాదులే తటస్థించారు. వారు చేరి రాజ్యాంగపరిషత్తులో, షెడ్యూలులో ఆంధ్ర రాష్ట్రమును ఎత్తివేయాలని న్యాయవాదులు అనగా షెడ్యూలులో లేకుండా పోయింది. మనలో ఎన్ని విభేదములున్నా రాష్ట్రవిషయములో ఒక అభిప్రాయముతో పనిచేసుకుంటున్నాము. కొన్ని లక్షలు ఖర్చుపెట్టి థార్ కమిషన్ చే నివేదిక వ్రాయించారు. వారు భాషా ప్రయుక్త రాష్ట్రవిభజనే పనికిరాదనగా జయపూర్ కాంగ్రెసులో నాయకత్రయకమిటీ ఏర్పడినది. తిరిగిఆశలలోపడ్డాం. ఇదే మనగతి ఎప్పుడూ ఆశలే. స్వరాజ్యము ఇంకా పూర్తిగా రాలేదు. బ్రిటిష్ వారిని మాత్రము వెళ్ళగొట్టాము. గాంధీగారు చెప్పినదానికి దూరముగానే వున్నాము. నాయకత్రయం వచ్చింది. రాష్ట్రము కావలెనంటే ఆంధ్రులు మద్రాసుపై హక్కులు వగులు కోవాలని వ్రాసిరి అది అర్థము లేనిమాట. ఈ మాటకు రహస్యము ఎక్కడో వుంది. దానిబలముతో 7, 8 మాసములు నగరము విషయమై రాష్ట్రము విషయమై ఇంత ఆందోళనచేసినాము. తీరా మన రాష్ట్రపతి చెన్నపట్నం వెంచేశారు. నగరముపై హక్కు వదులుకో మనే విషయమై నాయకత్రయ నివేదికలో విశదీకరించలేదని పట్టాభిగారు గ్రహించిరి. మదరాసునుంచి ఆంధ్రులు లేచిపొమ్మని అర్థముకాదని వెల్లడించిరి.

నగరపరిసరాల్లో పదిలక్షలమంది ఆంధ్రులు వున్నారనీ, చెన్నపట్నమును ప్రత్యేక రాష్ట్రముగా చేసే అవకాశము వున్నదని స్పష్టముగా చెప్పిరి. అయన, గాలిమాటలు ఏమీ చెప్పలేదు, వున్న విషయమును చెప్పాడు. వారు చెప్పినమాటలు బాగా వున్నవి. నివేదికను పట్టాభి పరీక్షించి మరీ చెప్పాడు. మనము సత్వర పరిష్కారమునకు ఆత్రముపడుచున్నాము. మనము, తమిసులము విడిపోవుటకు ఇలులేనంతగా కలిసిపోయియున్నాము. దక్షిణమున కుమారస్వామిరాజా, ఓ. పి. రామస్వామిరెడ్డియార్ లాంటి 50 లక్షలమంది ఆంధ్రులు వున్నారు. చెంగల్పట్ జిల్లాలో నూటికి నూరువున్న ఆంధ్రులు వున్న ప్రాంతమున్నవి. వీరంతా బ్రతికివుండగానే వారిని పరిగణించకుండా వుండగలమా? కాబట్టి చెన్నపట్నమును ప్రత్యేక రాష్ట్రము చేయాలంటే మన ప్రధాని శ్రీ రాజా "రంగాగారు, కళా వెంకటరావుగారు ఏకమై ప్రకాశాన్ని ఓడించవెదరని" చమత్కరించాడు. మనము కృతకృత్యులయ్యే సమయం వచ్చినది. నలుగురి తలకాయలు చేర్చి తీర్మానము తయారుచేశాము. నిజము చెప్పగానే అరవలు విమర్శించుచున్నారు. మదరాసు విషయమై ఎన్ని జాగ్రత్తలు తీసుకోవాలో అన్నీ తీసుకున్నాము. ఆంధ్రరాష్ట్రము ఏర్పడగానే అరవరాష్ట్రము ఏర్పడటము మదరాసు, ఆంధ్రులకు తమిళులకు హక్కుగల ప్రత్యేక రాష్ట్రముగా ఏర్పడటము జరిగిపోతుంది

తరువాత రాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షుడు శ్రీ పి. తిమ్మారెడ్డిగారు తీర్మానమును చదివి బలపరచుచూ ఇలా ఉపన్యసించారు.

#### శ్రీ తిమ్మారెడ్డిగారు

మద్రాసువల్ల ఏ ఏ సౌకర్యాలున్నాయో, అవన్నీ మనకు ఉండేలాగున మదరాసు ఉండే పరిస్థితి ఉన్నదని రాష్ట్రపతి చెప్పినందున ఆ చిక్కు తేలిపోయింది. మద్రాసు మనరాష్ట్రంలో లేకుండా పోతుందనే బాధ అందరికి ఉన్నది. కాని కొన్ని మనకు లభించేప్పుడు కొంత కష్టం వస్తుంది. స్వరాజ్యం రాగానే, మనకు ఎంత అవసరమైనా, నిపుణులైన వారినంతా పంపించివేశాం. కనుక మనం మదరాసు మనలో లేదని విచారించడం కన్నా అంతకన్నా సుందరమైన నగరాన్ని ఏర్పరచుకోడానికి నిర్మించుకోడానికి ప్రయత్నిద్దాం. మద్రాసును ఆంధ్రులందరూ, ముఖ్యంగా చిత్తూరు, కడప జిల్లాలవారు ఎక్కువగా ప్రేమిస్తున్నమాట నిజమే. కాని, ఈ పరిస్థితులలో మనం వాస్తవిక పరిస్థితులను బట్టి నడవవలసియున్నది.

రాయలసీమ ప్రజలకు ప్రత్యేకమైన విషయాలు చెప్పాలి. మొదటిలో, ఆంధ్రరాష్ట్రానికి రాయలసీమ వ్యతిరేకమని అనే వాడుక ఉంది. ఆ తగాదావలననే శ్రీబాగు పాక్టు వచ్చింది. నేడు ఆ శ్రీబాగుపాక్టువల్ల వచ్చిన సదుపాయాలుకూడా వదులుకోడానికి అంగీకరిస్తున్నారు.ఆనాడే కాదు ఈనాటికి కూడా ఆపాక్టులోని కొన్ని ఏర్పాట్లు రాయలసీమ ప్రజలను కించపర్చడానికి చేసిందనే అభిప్రాయంలో ఉన్నాము. ఎందువల్ల నంటే ఓటింగు విషయంలో దేశమంతాఒక రకంగా,రాయలసీమ మరొక రకంగాఉండడం మాకు గౌరవమా? అవిధంగా నిరంకుశ ప్రభుత్వంఅయిన రష్యాలో ఉంది. వెనుకబడిన ప్రాంతంఏది. అన్నిటికన్న విశాఖపట్టణ జిల్లాలో కొన్ని ప్రాంతాలుఏసౌకర్యాలువచ్చి నాయందుదానికివాలి. ఈలా, నేను, ఓబులరెడ్డి మొదలైనవారు రాయలసీమకు ద్రోహంచేసివచ్చేహక్కులు వదలుకుంటున్నారు అని అంటున్నారు. అలాంటి మాటలు పడేందుకు సిద్ధంగా ఉన్నాం కాని మనం రాయలసీమ, సర్కారులు అనే విభేదం మాట్లాడనంమానాలి, అంతా ఆంధ్రులమని వ్యవహరించాలి. కొందరు తీర్మానాలు తెబోతున్నారు రాయలసీమకు ప్రత్యేక సౌకర్యాలు కావాలి అని. అయితే,అచ్చటపడే బాధల దృష్ట్యా తీసికొనివచ్చినవి. ఆర్థికరీత్యా వెనకబడి ఉన్నాంగాన ఆప్రాంతాలకు ఆ విధమైన ప్రత్యేక సౌకర్యాలు కావాలి కాని, ఓటింగు విషయమై ప్రత్యేక వెయిటేజి కావలసిన నేను అంగీకరించడంలేదు.

ఇంతవరకూ అధికారాలు వచ్చి,పి.డబ్ల్యు.డి.వారుఖర్చుపెట్టినలెఖలు ఏప్రాంతంలో ఎంతఖర్చైందీ చెప్పగలరా! ఊరకే కొంక్షను అన్నిప్రాంతాలకూ అవుతాయి. కాని ఒకచోట ఖర్చు అవుతుంది, మరోచోట ఖర్చుపెట్టకరిగి ప్రభుత్వానికి వెళ్ళిపోతుంది. మనరాష్ట్రం మనకుంటే లోటువస్తే పన్నులు వేసికోగలం. అసలు పన్నులు హెచ్చుచేసికోవలసిన అవసరం ఉండదు. మనసహజసంపద అభివృద్ధిచేసి నుంటే అలాంటి అవసరంకన్పడదు. అనేకత్యాగాలుచేసి, మద్రాసుకు ప్రతిష్ట తెచ్చినది ఆంధ్రులే. ఆ మద్రాసు ఎవరి చేతిలోఉన్నా స్వరాజ్య సంపాదనలో ముందడుగువేసిన ఆంధ్రులదే అని అనకపోరు. మనవారు ప్రతివిషయాన్ని సమగ్రదృష్టిలో ఆలోచించాలిగాని, వ్యక్తిగత లాభనష్టములరీత్యా ఆలోచించవలదని అధ్యక్షులు తీర్మానం అంగీకరింపవలసిందని కోరారు.

#### శ్రీ బులుసు సాంబమూర్తిగారు

తరువాత సాంబమూర్తిగారు, తీర్మానంలో 5వ పేరాలో "26-7-49 తేదీని అఖిల ఆంధ్రపరిషత్తువలన ఏకగ్రీవంగా అంగీకరింపబడిన మదరాసునగరముకు గూర్చిన తీర్మానమునగూడ పరిశీలించియూ, ప్రస్తుతపరిస్థితులలో" అనుపదములను చేర్చవలెనని సవరణ ప్రతిపాదిస్తూ, పట్టాభివారు మదరాసునగరం విషయంలో వెలిబుచ్చిన అభిప్రాయం వారి అభిప్రాయమే గాక వర్కింగు కమిటీ వారి అభిప్రాయమని తెలిబుచ్చారు. రేపు రాబోయే వర్కింగుకమిటీలో ఆంధ్రరాష్ట్రం విషయము మాత్రమే గాకుండా మద్రాసు భవితవ్యం కూడా తేలిపోతుంది. లేకపోతే మనకు, అనంతర చర్యను ఆలోచించేందుకు అవకాశం యిస్తుంది. కనుక ఈ సవరణ సూచించాము. ఈ సవరణ అంగీకరించినందుకు రంగాగార్కి, ప్రకాశంగార్కి నా ధన్యవాదాలన్నారు.

తరువాత శ్రీ కడప కోటిరెడ్డిగారు ప్రత్యేక మద్రాసు రాష్ట్రమును ఆంధ్రరాష్ట్రము తోపాటే నిర్మించాలని సవరణ ప్రతిపాదించగా పొన్నేరి రామకృష్ణయ్యగారు బలపర్చారు.

#### అనంతశయనం అయ్యంగారు

మేము ఈమధ్య జరిగిన కన్వెన్షను ఆదేశానుసారం నెహ్రూగారివద్దకు రాయబారం వెళ్ళినసంగతి అందరకూ తెలిసినదే. అంతకుపూర్వం నెహ్రూగార్కి ఈ విషయం బాగా తెలియదని నా నమ్మకం.

మేము చెన్నపట్నం నిజపరిస్థితులు వార్కి విపరించి చెప్పగానే, వారు కార్యదర్శిని పిలిపించి నోట్సు తీసికొన్నారు. పటం తెప్పించి చూచి, పట్నం ఇద్దరికీ సంబంధించిన ప్రదేశంలాగుందే అన్నారు. వారికి విషయం నచ్చిందనుకున్నాను. కాని వ్యతిరేకం జరిగింది.

అరవలలో ఎవరైనా ఒక్కరు పట్నం వద్దు అన్నవారున్నారా. యింకా మనవారు పట్నం లేకపోయినా ఫరవాలేదనేవారున్నారు. జె. వి. పి. రిపోర్టులో బొంబాయి ప్రత్యేకరాష్ట్రం చేయవచ్చును అన్నారు. మదరాసు పా. పరిస్థితి అందుకు భిన్నమైనది అంటే ప్రత్యేకరాష్ట్రం వీలులేదనేకదా? పట్టాభిగారు మాత్రం City State గా చేయవచ్చును. అభ్యంతరంలేదన్నారు. అది కొంత సంతోషము. వివాదం విషయంలో మనం యిప్పుడే ఏమీ చేయాలని కోరం. కావాలంటే ఆ విషయానికి బౌండరీ కమిషన్ కు వదలవచ్చు. కోటిరెడ్డిగారు వెంటనే ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయవలెనని ప్రతిపాదించారు కాని, అది జరుగవచ్చు, జరుగకపోవచ్చు.

రాష్ట్రపతి చెప్పిన వ్యాఖ్యానంలో, చెన్నపట్టణం పూర్తిగా రాదనే అభిప్రాయంగాని, కొంతకూడా కోరగూడదని అర్థం ఏముంది. కాని ప్రత్యేక రాష్ట్రం చేయడంవల్ల, మొదట కొలానీ, అక్కడనుండి గంటువేయవచ్చు అనేవారితో ఏకీభవించుచున్నాను. వచ్చేప్పుడు ఈ తీర్మానమంతా తోసివేయవలెననే ఆవేశంతో వచ్చాంగాని, తరువాత ఆలోచించి, తీర్మానంతో ఏకీభవిస్తున్నాను.

#### కల్లూరి సుబ్బారావుగారు

ఆంధ్రంలో, ఇప్పటికి, మన పెద్దలసభ్యసఖ్యత ఏర్పడినట్టి దినం. ఇది ఆంధ్రచరిత్రలో ముఖ్యమైన దినం. సఖ్యతతో ఐక్యతతో ఈదినం ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి కంకణం కట్టుకొన్న దినం. తీర్మానం చాలా చతురతతో వ్రాయబడింది. నేను దీనికి ఏ సవరణలనూ అంగీకరించను. కనుక సంతోషపూర్వకంగా ఈతీర్మానాన్నంగీకరిస్తున్నాను.

మద్రాసు కావాలనే వాణ్ణి నేను. కాని మద్రాసు కొరకంగా ఆంధ్ర రాష్ట్రమును వదలుకునే వాణ్ణిగాను. అధికారయుతఆంధ్రరాష్ట్రమును సంపాదించుకొని తర్వాత మద్రాసునే కాక, బళ్ళారిలో పోయిన భాగములు కోలారు జిల్లలను కూడ సంపాదింపగలం (చప్పట్లు) రాయలసీమ ప్రాంతీయులు రాష్ట్రానికి ప్రతికూలురుకాదనేవారు కలిగించే విధంగా ఈదినం రాయలసీమ ప్రతినిధులు అందరూ ఈ తీర్మానాన్నామోదిస్తున్నారు. కాని శ్రీబాగుపాక్టుయొక్క ప్రాముఖ్యమును గమనించి వ్యవహరిస్తారని ఆసిస్తున్నాను.

#### శ్రీ కళా వెంకట్రావుగారు

శ్రీ కళా వెంకటారావు ప్రసంగించుచూ మొన్న ఈ మధ్య జరిగిన అఖిల భారత కాంగ్రెసు కార్యవర్గ సమావేశములో "నాయకత్రయ నివేదికపై రాష్ట్ర సంఘములవారు తమ ఆమోదాభిప్రాయములను వెల్లడించుట పునరము" అని ఉద్ఘాటించిరి. మద్రాసు ఆంధ్రంలోచేర వీలులేకున్న, తమిళ రాష్ట్రంలోమాత్రం చేర వీలులేదని పట్టాభిగారికి నాయకత్రయ నివేదిక రచనా కాలమునుండియూ తెలియును. దానికితగిన ఆధారములున్నవి. కాని ఈ రహస్యమును చివరకు బయలు పెట్టక డాక్టరుగారికి తప్పినదికాదు. అంతే మాత్రమే. నేటి తీర్మానముద్వారా ఆంధ్రరాష్ట్రము మాత్రమే సిద్ధించును. మిగిలినది మద్రాసు రాష్ట్రము. కోటిరెడ్డిగారు, ఆంధ్రరాష్ట్రముతో పాటు, మద్రాసుపట్టణరాష్ట్రముకూడా నిర్మింపబడవలెనని సూచించిరి. మనము నాయకత్రయ నివేదికను పరతులతో ఆమోదించుట అనుకూలవంతము కాజాలదు. ముందు ఆంధ్రరాష్ట్రమువచ్చుట ముఖ్యము. అది సిద్ధించినంతనే, మిగిలినమనహక్కులకొరకై ప్రయత్నించి వాటిని సాధింపవీలగును. రాయలసీమ నవరత్నాలతో, కోస్తాలోని నవధాన్యాలతో, మనరాష్ట్రం సంపూర్ణ స్వయంపోషక వంతమైన దవుతుంది, రేపు మద్రాసు ప్రభుత్వంకూడా నాయకత్రయ నివేదికపై తన అభిప్రాయమును పంపనున్నది. తమిళనాడు కాంగ్రెసువారు ఆపనినింతకుముందే చేసినారు. మనముకూడా వెంటనే ఆమోదించి, రాష్ట్రసాధనను సులువుజేయవలెను, అని వెంకట్రావుగారు విజ్ఞప్తి చేసిరి.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు మాట్లాడుచూ, మద్రాసును వదలుట బాధాకరముగా నున్నదనిరి. చిత్తూరు జిల్లాలో అప్పుడే అరవవారిచేత, తెలుగువారిచేత ప్రచారములు సాగింపబడుచున్నవి. అరవలూ తెలుగులు పోట్లాడుకొనుట క్షేమము కాదు. ప్రభుత్వము ప్రజలకు తృప్తికరమగు ఏర్పాటులను వెంటనే చేయవలెను. వెంటనే సరిహద్దు నిర్ణాయక సంఘమును నియమించుట ముఖ్యము అనిరి.

బొమ్మా శేషురెడ్డి, కడప రామసుబ్బమ్మగార్లు ఈ విధంగా ఉపన్యసించారు.

రాష్ట్రపతిగారు వారిదివరకు చెప్పిన మాటలవలన మద్రాసుఆంధ్రులు పడినబాధలను గమనించి, ఈ నాటికైనా నిజమైన అర్థము చెప్పినందులకు, ఆంధ్రులభయము తీర్చినందులకు వారికి కృతజ్ఞులము.

షణ్ముఖంచెట్టిలాంటివాళ్లు చెప్పినంత మాత్రాన మద్రాసువదలి వెళ్ళిపోవునంత పిరికిపందలుగారు, ఆంధ్రులు. తన ప్రతిభవల్ల మనకు రాష్ట్రం సంపాదించి పెడుతున్న రాష్ట్రపతిగారే, ముమ్ముందు మనకు మద్రాసునుగూడ సంపాదించి పెట్టగలరని ఆశిస్తున్నాము.

#### శ్రీ దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు

నిన్నమొన్న మాటలనువింటే, నేడు దుర్గా కళామందిరం ఆంధ్రుల భారత యుద్ధరంగంగా పరిణమిస్తుందనే ఆశతో చాలామంది మిత్రులువచ్చారు. వారుకోరిన విషయంలో ఆశాభంగమైనప్పటికీ, నేను ఈ వేదికమీద, ఆంధ్రులలో కన్పర్చబడిన లెక్కలే, సామరస్యత, వారి కమిశానందం తప్పక సమకూర్చియుంటుందనీ, చిరకాల వాంఛితమైన ఆంధ్రరాష్ట్రమునకు నేడు విఘ్నేశ్వరపూజ జరగడం చూడడంవల్ల, వారికి అంతకన్న వేయిమడుగులు సంతసం కల్గియుంటుంది—ఈనాడైనా జె. వి. పి. రిపోర్టును మనం అంగీకరించకపోతే ఆంధ్రులకు అమితమైనకష్టం కల్గి ఉండేది. చరిత్రపరిశీలిస్తే, దక్షిణదేశాన్ని ఆంధ్రులు పరిపాలించినది కన్పడుచుంది గాని, ఆంధ్రదేశాన్ని అరవలు రాజ్యం చేసినదికన్పడదు. ఈనాడు ఈ వేదికపైనంత ఏకకంఠంతో ఐక్యభావంలో మననాయకులు యావన్మందీ కార్యక్రమం కొనసాగించారంటే, ఆంధ్రుల పురోభివృద్ధికి పునాది వేశారన్నమాట.

#### శ్రీ అ. కాళేశ్వరరావుగారు

మనలో ఎన్ని భేదాలున్నా, సమయం వచ్చేసరికి కలసికలమని ఇదివర- రుజువు జేశాం. ఆంధ్రుల కథ్యక్షతపదవి వచ్చే అవకాశం వచ్చినపుడు మన ప్రకాశంగారి నాయకత్వం క్రింద, ఆంధ్రులందరం కలిసి పనిచేశాం. ఈసారికూడా మరల ముఖ్యమైన తరుణం వచ్చినప్పుడు అందరం కలిసి ఏకగ్రీవంగా తీర్మానం ప్యాసుజేస్తున్నాం. ఆంధ్రరాష్ట్రం వెంటనే వస్తుందనే నమ్మకం ఉంది. కాని, మద్రాసు మాకేకావాలని, అరవలు ప్రతిఘటిస్తారు కాని మైకమాండును వారా ప్రతిఘటనమతో సిపుచ్చ మనరాష్ట్రం ఏర్పాటు చేస్తారని నమ్మవలసిఉంది. ఇక మద్రాసుప్రత్యేకరాష్ట్రం జేసే విషయంలో ఇదివరకు జె. వి. పి. రిపోర్టును అంగీకరిస్తే, ఆందోళనే చేయరాదన్నారు. కాని మరల మనకు ఆహక్కు మరల వచ్చింది. ఆంధ్రరాష్ట్రంలో సుపరిపాలన జరిగేందుకు వీలుగా, రాష్ట్రంలో గ్రూపులన్నీ పోయి, గాంధీజీ ప్రకాశంగారిద్వారా ఆదేశించినట్లు ఆంధ్రులంతా ఏకమవవలెనని విశ్వసిస్తున్నాను. త్వరలో తెలంగాణాకూడామనలోకివస్తు-ది. నాకు తెలంగాణ నాయకుల అభిప్రాయములు బాగా తెలుసు కనుక ఒకటి రెండు సంవత్సరాలలోనే,విశాలాంధ్రావతరణం కూడా జరుగుతుందని ఆశిస్తున్నాను.

శ్రీ ప్రకాశం చర్చలకు సమాధానమిచ్చుచూ, ఉపన్యాసకు లందరకూ ఏకాభిప్రాయము కుదిరినట్టులే తమకు విశ్వాసము కల్గినదనిరి. మద్రాసు విషయములో మన హక్కులకు భంగమువాటిల్లకుండగా ఉండునట్టులే, తీర్మానము రచింపబడినది. ఎంతయో తలవంచి, ఇట్టి తీర్మానము చేయకతప్పదు. రాజ్యాంగ చట్టము ఆమోదింపబోవుచున్నది. అందుచే తొందరపడక తప్పటలేదు. మద్రాసును ప్రత్యేక రాష్ట్రముగా చేయ వీలును నేమో చూడవలసినదని కోరుట తప్పుకాదు. 290 సెక్షన్ సహాయంతో గవర్నర్ జనరల్ కౌన్సిల్ లో ఈ రాష్ట్రాన్ని చేయవలెనని కోరుచున్నాము. తరువాత ఏమగునో తెలియును. మద్రాసును ప్రత్యేక రాష్ట్రముగా చేయుట సరిహద్దు నిర్ణాయక సంఘముపని. దానికి చాలా తతంగమున్నది. మనము మద్రాసువారిని చిన్నమాపు చూపుచుంటిమని ఎవ్వరునూ అనుకొనరాదు– ఆరితిగా ప్రచారముచేయరాదు, అని ప్రకాశంగారనిరి

సవరణలను ప్రతిపాదించిన వారందరునూ, ఉపసంహరించుకొనిరి.

రాత్రి ఏడు పదిహేను నిమిషములకు తీర్మానము జయజయ ధ్వానముల మధ్య ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

---

## "రామపాదసాగరం డివిజను రద్దు చేయబడినది"

### శాసనసభలో ప్రశ్నలకు మద్రాసు పబ్లిక్ వర్క్సు మంత్రి సమాధానం

చెన్నపట్నం, నవంబరు 12: రామపాదసాగరం ప్రాజెక్టు విశదమైన పరిశోధన ముగిసినందున పోలవరంవద్ద ఉన్న రామపాదసాగరం డివిజను రద్దు చేయబడినదనియు అయితే గోదావరీ పశ్చిమ డివిజనుకు ఒక సబ్ డివిజనును ఏర్పాటుచేసి శేషించిన పరిశోధనకు కొంత సిబ్బందిని మాత్రము ఉంచినారనియు నేడుమద్రాసు పబ్లిక్ వర్క్సు మంత్రి ఎం. భక్తవత్సలం గారు రామపాదసాగరమును గూర్చి నేను ప్రశ్నోత్తరముల సమయమున వచ్చిన ప్రశ్నకు సమాధానముగా తెలిపిరి.

లింగరాజుగారి పేర ఉన్న ప్రశ్నలో పోలవరంలో రామరావసాగరం డివిజనును రద్దుచేయుచూ ఉత్తర్వులు చేసినారా అనియు, దానికి కారణము లేమనియు అడుగబడెను. శ్రీ లింగరాజుగారు తమ స్థానములో లేనందున దిగుమర్తిరామస్వామిగారు ఆ ప్రశ్నను అడిగిరి.

శ్రీ రామస్వామి: డివిజను రద్దు చేయుటేగాక అచటి పరికరములనుగూడా మరొక చోటుకు తరలించినారా?

స: నాకీ సందర్భమున అట్టి సమాచారమునూ తెలియదు.

శ్రీ బి. ఎస్. మూర్తి: పరిశోధన సాంతమైనట్లయితే శాశ్వతమైన ఒక సబ్ డివిజను మాత్రము ఎందుకు ఉంచినారు?

స: నేనిదివరకే సమాధాన మిచ్చినాను.

## అమెరికాలో నెహ్రూ ప్రసంగములు

మద్రాసు, నవంబరు 12: భారత ప్రధాని నెహ్రూ అమెరికా పర్యటన సందర్భంలో 'వాయిస్ ఆఫ్ అమెరికా' వారు రికార్డుచేసిన ప్రోగ్రాములు మదరాసు రేడియోకేంద్రంనుండి రేపురాత్రి 9.45 గం 10.30 వరకు ప్రసారం చెయ్యబడును. ఈ రికార్డులలో నెహ్రూఅక్కడక్కడ చేసిన ప్రసంగములుకూడా ఉండును.

---

# చరిత్రాత్మకమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌సంఘ సర్వసభ్యసమావేశం



అఖిలభారత కాంగ్రెస్ సంఘ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు నాయకత్రయ నివేదికను ఆమోదింపవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నారు.



మధ్యాహ్నం (శుక్రవారం) తిరిగి సమావేశం కాగానే అధ్యక్షుడు ఆచార్య రంగాగారు కార్యవర్గం తయారుచేసిన రాష్ట్ర తీర్మానాన్ని సభ్యులకు వివరిస్తూ, ప్రకాశం పంతులుగారిని ప్రతిపాదింప కోరుచున్నారు.



అఖిలభారతకాంగ్రెస్‌సంఘ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు, రాష్ట్రకాంగ్రెస్ సంఘకార్యవర్గసభ్యుడు శ్రీ యం. పళ్ళంరాజుగారు సర్వసభ్యసమావేశానికివస్తున్నారు.



శుక్రవారం మధ్యాహ్నం సమావేశానికి హాజరయ్యేందుకు వస్తున్న రాష్ట్ర కాంగ్రెస్‌సంఘ అధ్యక్షుడు ఆచార్య రంగా, కార్యదర్శి గౌతు లచ్చన్న డాక్టర్ కె. వి. స్వామిగార్లు.



తుపాను బాధితులకు సహాయం చేసేవిషయంలో రాష్ట్రసంఘంవారు చేసిన సూచనలను సుముఖంగా ఆలోచించగలమని హామీ ఇస్తున్న రాష్ట్ర మద్యనిషేధ మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు.



రాష్ట్రకాంగ్రెస్ జాయింటు కార్యదర్శి శ్రీ దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారు కోస్తాజిల్లాల తుపానుపై కార్యవర్గంచేసిన తీర్మానాన్ని సర్వసభ్యసమావేశంలో ప్రతిపాదిస్తున్నారు.



సమావేశానికి వస్తున్న శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు, తెన్నేటి విశ్వనాథంగారు, కొమ్మారెడ్డి సూర్యనారాయణగారు.



శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు సమావేశంలో పాల్గొనేందుకు వస్తున్నారు.



రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గంచేసిన రాష్ట్ర తీర్మానాన్ని (శుక్రవారం ఆంధ్రపత్రికలో ప్రకటితమైంది) పరిశీలిస్తున్న శ్రీ కళా వెంకట్రావుగారు, శ్రీ కల్లూరి సుబ్బారావుగారు, శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, మల్లెల శ్రీరామమూర్తిగారు.



మద్రాసు ప్రతినిధులు లెఫ్టినెంట్ కలనల్ శాస్త్రి, శ్రీ బులుసు సాంబమూర్తి, సర్ యన్. వి. రామమూర్తిగార్లు సర్వసభ్యసమావేశానికి హాజరయ్యేందుకు వస్తున్నారు.

## రత్నఖచిత స్వర్ణమయ అశోక స్థూపం

### నెహ్రూకు జన్మదిన బహూకృతి

బొంబాయి, నవంబరు 12: తన జన్మదినమైన నవంబరు 14వాడు బొంబాయిలో పెద్ద ఉత్సవం ఏవన్నా ఏర్పాటు చేసే పక్షంలో అందులో తాను పాల్గొనలేనని నెహ్రూ ప్రధాని బొంబాయి ప్రధాని అయిన బి. జి. ఖేర్‌కు కేబిల్ ద్వారా తెలియజేశారు.

నవంబరు 14 సాయంకాలం 6 గంటలు మొదలు నెహ్రూ బొంబాయి చేరుతారు. ఇండియన్ నేవల్ గ్రేటరు వారి నృత్య ప్రదర్శనం చూస్తానని అదివరకే ఆయన మాట ఇచ్చారు. నవంబరు 15 ఉదయం తిరిగి తాను ఢిల్లీకి బయలు దేరవలసి ఉంటుందని కూడా ఆయన ముందుగానే తెలియజేశారు.

ప్రస్తుతం ఆయన జలుబుతో బాధపడుతున్నారు. ఆయన లండను నుండి తిరిగి వచ్చేసరికి అదిపూర్తిగా నివారణ కాకపోవచ్చును.

వెయ్యిమంది సభ్యులుగల నెహ్రూ జన్మదినోత్సవ సంఘంవారు నవంబరు 14వ నెహ్రూకు సన్మానం చేసే ఏర్పాటులను మానటంలేదు. ఆ సన్మానంలో నెహ్రూకు రత్నఖచిత స్వర్ణమయ అశోక స్థూపం బహూకరించబడుతుందట.

## బెవిన్‌తో నెహ్రూ సంభాషణలు

లండను, నవంబరు 11: భారతప్రధాని పండిట్ జవహర్లాల నెహ్రూ బ్రాడ్ లాండ్స్‌నుండి రేపు ఉదయం లండను తిరిగి రావడం తడవుగా ఆయన కార్యక్రమం ఆరంభమవుతుంది. రేపటితో ఇంగ్లండులోని ఆయన కార్యక్రమం ముగుస్తుంది.

రేపు ఉదయం నెహ్రూ భారత రాయబార శాఖల ప్రధానోద్యోగులను కలుసుకొని, భారతీయ విద్యార్థుల్తో అనధికార సంభాషణలు జరిపి, అనంతరం బ్రిటిషు విదేశాంగ కార్యదర్శి బెవినుతో మధ్యాహ్న భోజనం చేస్తారు.

ఇటీవలనే పారిసులో అమెరికా కార్యదర్శి డీన్ ఎచిసన్‌తో విదేశ విధానాలను గురించి మాట్లాడివచ్చినబెవిన్‌కొన్ని దూర ప్రాచ్య సమస్యలను గురించి పండిట్ నెహ్రూతో అనధికార్య రీత్యా మాట్లాడవచ్చును. చైనాలోని నూతన ప్రభుత్వాన్ని గుర్తించడం కామన్వెల్తు దేశాల ప్రధాన సమస్య. ఈ సమస్యను గురించి పండిట్ నెహ్రూ ఇదివరకే తన బహిరంగోపన్యాసాలలో చైనాపరిస్థితిని వాస్తవిక దృష్టితో చూడాలని తన భావంగా ప్రకటించి ఉన్నారు.

ఇండోచైనా పరిస్థితి గురించి అక్కడి భారతీయ కాన్సలు జనరలు ఇటీవల ఢిల్లీయా ప్రభుత్వానికి పంపిన వార్తలు బ్రిటిషు విదేశ కార్యాలయానికి అందజేయబడినవి. ఈవిషయమైకూడా నెహ్రూ బెవినులు మాట్లాడవచ్చును.

రేపు అపరాహ్ణంలో భారత రాయబార కేంద్రంవారు ఏర్పాటు చేస్తున్న సమావేశంలో నెహ్రూ ఇక్కడి భారతీయులను కలుసుకొంటారు. రేపురాత్రి వెస్టెండులోని ఒక థియేటరులో నెహ్రూ నాటక ప్రదర్శనం చూస్తారు.

ప్రస్తుతం ఆయన బ్రాడ్‌లాండ్స్‌లో విశ్రాంతి తీసుకొంటున్నారు. ఆయన కుమార్తె శ్రీమతి ఇందిరాగాంధి నిన్న అక్కడికి వెళ్లారు. నేటి సాయంకాలం భారత హైకమిషనరు కృష్ణమీనను కూడా మోటారులో అక్కడ చేరారు.

# విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో భారత ప్రధాని పండిట్ నెహ్రూ



ప్రధానామాత్యుడు పండిత నెహ్రూకు విస్కాన్సిన్ జనరల్ ఆస్పత్రిలో నర్సింగ్ శిక్షణ పొందుతున్న విద్యార్థినులు స్వాగతమిచ్చిన దృశ్యం.



విశ్వవిద్యాలయాధ్యక్షుడు ఇ. బి. ఫ్రెడ్ నెహ్రూను వెస్టుహిల్ వ్యవసాయక్షేత్రానికి తీసుకు వెళుతున్న దృశ్యం.

# తూ. గో. జిల్లాలో నూర్పుకు సిద్ధంగా వున్న వేలకొలదిఎకరాలపంట నాశనం

## తుపాను, వరదలవల్ల ప్రజా జీవితమంతా తారుమారు

### నష్టాన్నిగూర్చి ప్రభుత్వానికి జిల్లాకలెక్టరుని వేదిక

రాజమండ్రి, నవంబరు 8: తూర్పు గోదావరి జిల్లాలో సంభవించిన తుపాను నష్టాలను గూర్చి కలెక్టరు డి. బాలసుందరం్ప్రిప్ ప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పించారు.

అక్టోబరు 27 వ తేదీన, 28 వ తేదీన చెలరేగిన తుపాను ఈ జిల్లా అంతటా, ముఖ్యంగా కోస్తా ప్రాంతాలలో భయంకర విహారం చేసింది. 27 వ తేదీరాత్రి వానతో సహా ఝుంఝుమా మారుతం ప్రబలంగా వీచింది. 28 వ తేదీ రాత్రి మరింత పెద్ద వర్షం కురిసింది. 27 వ తేదీ రాత్రి వీచిన గాలికి ఇళ్ళు, పాకలు చెట్లు కూలిపోయాయి. అమలాపురం రాజోలు తాలూకాల్లో కొబ్బరి చెట్లు, అరటి చెట్లు, చెరకు తోటలు సమూలంగాపడి పోయాయి. రామచంద్రపురం, కాకినాడ తాలూకాలలో కూడా యిలాగే జరిగింది.

అమలాపురం తాలూకాలో ఉప్పాడి, కాట్రేని కోనల మధ్య జిల్లాబోర్డు వరకూ ఉప్పెనవచ్చి, కాట్రేనికోన, కుండిపప్ప...

అమలాపురం డివిజనులో పూరిఇళ్ళు యావత్తూ దాదాపు 24,846 ఎగిరి పోయాయి. రాజోలు తాలూకాలో 2061 పెంకుటిళ్లు, 15,007 పూరిఇళ్లు, నాశనమయ్యాయి. కాకినాడ శివార్లలో 100 పాకలు నేలమట్టమైనవి. గ్రామాల్లో ఎన్నో ఇళ్లు కూలినవి; కొన్ని ఇంకా నీటి అడుగునే వున్నవి. పిఠాపురం తాలూకాలో మాధవపట్నం, ఇసుకపల్లి గొల్లప్రోలు గ్రామాలు పూర్తిగా నీటిలో మునిగాయి. రాజోలు తాలూకా, తాటిపాకలో ఒకబియ్యం మిల్లు, మొగలి కుదురులో ఒకసినీమాహాలు పడిపోయాయి. తునిలో 500 ఇళ్లు, లక్షరూ॥ల విలువైన సినీమాహాలు కూలిపోయినవి.

#### పైర్ల నష్టం

డెల్టా తాలూకాలన్నిటిలోను నూర్పిడికి సిద్ధంగావున్న రసంగి, బసంగిపంటలు అకస్మాత్తుగా నీటిలో మునిగి నష్టమైనాయి. ముఖ్యంగా అమలాపురం, రాజోలు...

#### నష్టం వివరాలు

#### సహాయపు ఏర్పాటు

## 'పెద్ద పట్టణాలు కేంద్రాధీనంలో ఉండాలి'

### గొ. సీతారామ శాస్త్రిగారి సూచన

విజయవాడ, నవంబరు 11: 'భారతదేశ రక్షణదృష్ట్యా పదిలక్షల జనాభాగల పట్టణములన్నిటినీ, కేంద్రప్రభుత్వ పరిపాలనక్రింద వుంచుట అత్యవసరము. కనుక మద్రాసునగరాన్ని కేంద్రప్రభుత్వ పరిపాలనక్రిందనే వుంచుకొని, మిగతా 12 ఆంధ్ర జిల్లాలతోనూ వెంటనే ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మించాలి' అని సర్దార్ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు...

## పురపాలక సంఘ సభ్యుల విధులు

### నంద్యాలలో రాష్ట్రపతి పట్టాభిగారి సూచనలు

(స్వకీయ విలేఖరి)

నంద్యాల, నవంబరు 7: ప్రజలు కోరిననే అగ్నాలనువారు స్థానికసంస్థల పదవులకువెళ్లి ప్రజాసేవ చేయునటుననియు, పదవీవ్యామోహముతోనూ, స్వప్రయోజన సార్థమున్న వాటికై రొంగబడి, వాటిని కలుషితము చేయరాదని, రాష్ట్రపతి పట్టాభి సీతారామయ్యగారు నంద్యాల పురపాలక సంఘ సన్మానపత్రమునకు జవాబొసంగుచూ హెచ్చరించిరి.

సభకు పురపాలక సంఘాధ్యక్షుడగు దేశాయి కుప్పరావుగారు అధ్యక్షత వహించి, స్వాగతపత్రమును చదివిరి.

ప్రస్తుతమున పురపాలకసంఘముల పరిస్థితినిగూర్చి ముచ్చటించుచూ డా॥ పట్టాభిగారు పురపాలకసంఘ సభ్యులకు మూడు విధులను సూచించిరి. ప్రతి సమావేశమున కును తప్పక హాజరు కావలసినదనియు, ...

## రాజమండ్రి పట్టణ కాంగ్రెస్‌లో కలతలు

### కొందరు సభ్యులపై ఛార్జి పత్రం దాఖలు

## మచిలీపట్నం జాతీయ సేవాసంఘం తీర్మానాలు

## 12 ఏండ్ల బాలుని అద్భుత ధారణాశక్తి

### 'అపూర్వ బాలమేధావి' అని సి. ఆర్. రెడ్డి ప్రశంస

తుని, నవంబర్ 10: స్థానికబోర్డు హైస్కూల్లో 3 వ ఫారము చదువుచున్న కొండూగా శ్రీ కృష్ణహరనాథ ప్రభువు అనే 12 ఏండ్ల బాలుడు అద్భుతధారణాశక్తిని ప్రదర్శిస్తున్నాడు. ఏ సంవత్సరములోని నెల తేదీ యిచ్చినను, వారము పేరు చెప్పును. వారము పేరు యిచ్చిన, తేదీ చెప్పును. ఏ మియు ఆలస్యము లేకుండా, ఆలోచించకుండా, తడుముకోకుండా వెంటనే చెప్పును.

ఈ బాలుని ఆంధ్ర యూనివర్సిటీ వైస్‌చాన్సలర్ శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు వాల్తేరు రావించి, అనేకమంది ప్రొఫెసర్ల సమక్షములో పరీక్షించిరి. లెక్చరర్లు సహితము లెక్క వేస్తేనేగాని చెప్పలేని పరిస్థితిలో యీ బాలుని తక్షణ సమాధానములకు ఆశ్చర్య పడినారు. ...

## చోళ సముద్రంలో విశ్రమ ప్రజారోగ్య కేంద్రము

## 6 నెలలు కఠినశిక్ష

# రేడియో ప్రోగ్రాములు

నవంబరు 14 సోమవారం

## మద్రాసు (ఎ)

ఉ. 7-30 రామా శారద పాట 8 ఆంగ్లమున వార్తలు 8-15 ఉదయగానం (రి) 8-30 మద్రాసు (బి) వలె మ. 1-30 ఆంగ్లమున వార్తలు 1-40 సినిమా సంగీతం (రి) 2-15 ఉన్నతపాఠశాలా విద్యార్థులకు ఆంగ్లమున 4-30 పాశ్చాత్య సంగీతం (రి) సా. 5-40 సి. సుందర శారదాంబాళ్ పాట 6 ఆంగ్లమున వార్తలు 6-20 ఎం. జె. శ్రీనివాసయ్యంగార్ వీణ 7-30 గీత మంజరి (రి) 7-45 జంత్రసమ్మేళనం 8-30 ఇ. వి. రామచంద్రన్ పాట 9 ఆంగ్లమున వార్తలు 9-15 మద్రాసు (బి)వలె 10 సినిమా సంగీతం (రి).

## మద్రాసు (బి)

ఉ. 7 తెలుగున వార్తలు 7-15 జి. ఎన్. బాలసుబ్రహ్మణ్యం (రి) 7-45 మద్రాసు (బి) వలె 8-30 వి. సి. ఎల్. కృష్ణన్ పాట మ. 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు ఆధునిక గద్య నిర్మాతలు ముట్నూరి కృష్ణారావు ప్రసంగం బృందగానం కె. టి. సి. తెలుగు బాలికా పాఠశాలా విద్యార్థినులు 1-30 మద్రాసు (ఎ) వలె 1-50 తెలుగున వార్తలు 2-15 మద్రాసు (ఎ)వలె 4 ప్రాథమికపాఠశాలా విద్యార్థులకు వృక్షశాస్త్రము అనాసలు ప్రసంగం టి. వి మంజుల గద్యకథ. నేను రచయితనైతాను వ్యాయామ పాఠములు జె. ఎస్. రావు సా. 5-30 మద్రాసు (బి) వలె 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయదారునికి సలహాలు పంటలనకాలు రక్షణ...

## విజయవాడ

## హైదరాబాదు

## కావలెను

### ఫెడరల్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, ప్రకటన నెం. 69

పుట్టకవల్లగాని, నివాసమువల్లగాని భారత అధినివేశపు పౌరులై యున్న వారి నుండి, దిగువ తెలిపిన ఉద్యోగమునకు దరఖాస్తులు కోరబడుచున్నవి భారతీయులకు జన్మించినవారును, భారత అధినివేశములో చేరని భారత సంస్థానముల పౌరులును, పాకిస్థాన అధినివేశముయొక్కయు, భారత దేశమునకు ఆనుకొని యున్న యే యితర దేశముయొక్కయు పౌరులున్ను గూడ అర్హులైయున్నారు. అయితే, వారి విషయములో, ఉద్యోగ నియామకమునకు ముందు, వారి అర్హతను గురించి భారత అధినివేశ ప్రభుత్వమువారిచే జారీచేయబడిన దీక్షతేషను దాఖలు చేయవలసియున్నది. నిమ్నజాతి అభ్యర్థులకు వయోపరిమితి మూడు సంవత్సరముల ఎక్కువగా నుండవచ్చును. ప్రత్యేక పరిస్థితులలో తప్ప యితరులకు వయోపరిమితి సడలింపుగా నుండవలెను. ఏ సందర్భములోను మూడేండ్లకు మించియుండగూడదు. వివరములు దరఖాస్తు ఫారములు, సెక్రటరీ, ఫెడరల్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, కౌన్సిల్ హౌస్, పోస్టుబాక్సు నెం. 186, న్యూఢిల్లీ నుండి పొందవచ్చును. ఫారములకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును, అభ్యర్థులు, ఉద్యోగము పేరు వివరించవలెను. రు 7-8 లకు (నిమ్నజాతి అభ్యర్థులకు రు 1-14-0) ట్రెజరీ రశీదుగాని, క్రాస్ చేసిన యిండియన్ పోస్టల్ ఆర్డరుగాని, చెల్లి, దరఖాస్తులు 10-12-1949 తేదీలోగా చేరునట్లు పంపవలెను. క్రాస్ చేసిన పోస్టల్ ఆర్డర్ల మీద, న్యూఢిల్లీ పోస్టాఫీసువద్ద, ఫెడరల్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ సెక్రటరీకి చెల్లింపబడునట్లు వ్రాయవలెను. దరఖాస్తుదారు నిజమైన కాందిశీకుడనియు, నిర్ణయించిన రుసుమును చెల్లించుటకు శక్తిలేనివాడనియు, కమీషనువారు తృప్తిపడినచో, వారి యిష్ట ప్రకారము, నిర్ణీతమైన దరఖాస్తు రుసుమును తీసివేయవచ్చును, చెక్కులుగాని మణిఆర్డర్లుగాని అంగీకరింపబడవు. భారత దేశమునకు వెలుపలనున్న అభ్యర్థులు నిర్ణీత దరఖాస్తు ఫారములు దొరకనియెడల సాదా కాగితముమీద దరఖాస్తులు పెట్టవచ్చును, అట్టి అభ్యర్థులు తమ రుసుములను, ఇండియా హైకమీషనరు ఆఫీసువద్దగాని, ఇండియన్ రాయబారి ఆఫీసువద్దగాని, భారత దేశ ప్రభుత్వ ప్రతినిధి ఆఫీసువద్దగాని, ఆయా సందర్భములను బట్టి, డిపాజిటుచేసి, సదరు రశీదును తమ దరఖాస్తులలో జతపరిచి పంపవలెను విదేశములలో నివసించు అభ్యర్థులకు 2 వారములు హెచ్చు గడువు యివ్వబడును. అడిగినప్పుడు, స్వయముగా హాజరు కాని యెడల అట్టి యే అభ్యర్థి గురించియును ఉద్యోగ నియామకమునకు దరఖాస్తు విచారింపబడదు.

న్యూఢిల్లీ, ఆల్ ఇండియా రేడియో, డైరెక్టర్ జనరల్ యాజమాన్యము క్రింద నడుపుచున్న ఆల్ యిండియా రేడియో తెలుగు ప్రోగ్రాం పత్రిక "వాణి" కి ఒక సహాయ సంపాదకుడు (గెజెటెడ్) కావలెను. ఈ ఉద్యోగముయొక్క తరగతి బహుళ సెంట్రల్ సర్వీస్ II వ తరగతిలో చేరును. ఉద్యోగము 28-2-1950 వరకు ప్రస్తుతము తాత్కాలికముగా నుండును. ఇంకను కొనసాగింపబడుటకు అవకాశము కలదు. జీతము:— రు 400-25-500. ఇ. బి.-30-620 వయస్సు—25, 40 యేండ్లు, పూర్వ వయస్సు కలిగియుండవలెను. గవర్నమెంటు ఉద్యోగులకు ఈ నిబంధన సడలింపబడును. అర్హతలు (I) తెలుగులో ప్రవీణత కలిగి, మంచి విద్యాధికులై యుండవలెను. (II) స్వచ్ఛమైన తెలుగులో స్వతంత్ర రచన చేయగల శక్తి, పత్రికను అందముగా తయారుచేయుటకు అవసరమైన "లేఔట్" చిత్రములను అమర్చు పరిజ్ఞానముతో సహా పత్రికారచనయందు అనుభవం కలిగియుండవలెను. (III) ప్రూఫులను దిద్దగల జ్ఞానము, స్వయంగా పత్రికను తయారుచేయగల సామర్థ్యము ఉండవలెను. (IV) పేరు పొందిన ఒక దినపత్రిక, లేక సచిత్రపత్రిక, కార్యాలయంలో కనీసం 2 సంవత్సరముల అనుభవము పొంది యుండవలెను. (V) ఒక పత్రికను స్వయంగా తయారుచేయుటకు, దానికి సంబంధించిన అచ్చు యేర్పాట్లు, వ్యాపారపు పద్ధతులు (ప్రకటనలు, సర్క్యులేషను సహా) మున్నగువవి చూచుకొనుటకు తగిన తాహతు కలిగియుండవలెను.



## వారఫలాలు

నవంబరు 13 వ తేదీ మొదలు 19 వ తేదీవరకు

### గ్రహస్థితి

రవి (17 వరకు బుధునితో తుల తర్వాత వృశ్చికం) కుజ శనులు (సింహం) గురువు (మకరం) శుక్రుడు (ధనుస్సు) రాహువు (మీనం) చంద్రుడు (కటక,సింహ,కన్య, తులల్లో) 13 బుధచంద్ర (కేంద్రం)రాహు చంద్ర (కోణం) 15 శుక్రచంద్ర (కోణం) కుజచంద్ర, శనిచంద్ర (యుతి) 16 గురు చంద్ర (కోణం) 17 శుక్రకుజ (కోణం) శుక్రచంద్ర (కేంద్రం) కేతుచంద్ర(యుతి) 18 గురుచంద్ర (కేంద్రం.)

### ధరలు

ప్రత్తి (జారిల్లా) నూలూ వస్త్రాలూ

శనికుజ సామీప్యంవల్ల మార్కెట్టు కొంత బిగువుగా యుంటుంది.

వెండి-బంగారాలు

19 మార్కెట్టు క్రమేణా జోరుగా తగ్గుతుంది.

వాటాలు

హెచ్చినప్పుడంతా అమ్మండి.

ధాన్యములు - ఆహారవస్తువులు

మిర్చి చక్కెరా చెరకుబెల్లం మరి కొంత హెచ్చేసూచనలున్నవి. నూనెలకు నిలకడ నెయ్యి కొంత తగ్గుతుంది.

### లగ్నఫలాలు

మేషం (అశ్విని,భరణి,కృత్తిక 1వపాదం)

ఈ వారంలో పరిస్థితులు ఇంచుమించు గతవారంలోలాగే 15 సాయంత్రంవరకూ యుంటవి. ఆలోచనలతో మనస్సునకు విరామం, విశ్రాంతీ యుండదు. ఆధ్యాత్మిక విచారంలోకానీ, దైవధ్యానంలో కాని కాలం గడపడం ఉత్తమం. 16-17 ల్లో వ్రాతలూ-పరిష్కారాలూ - లాభకరముగా యుండకలవు. 18-19 ల్లో నూతన యత్నం ప్రయాణం-జయప్రదం అవుతవి. ఆప్తులను కలుస్తారు. ఆర్థిక పరిస్థితులు సర్దుబాటు అవుతవి.

వృషభం (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర, 1 2. పాదాలు)

ఈ వారంలో 13 సాయంత్రంలోగా 18-19 తేదీల్లో మీ ఉద్దేశ్యాలను కార్యరూపంలో ఉంచడానికి వీల్లు కలుగుతవి. 14-15 ల్లో అనుకున్న ప్రయాణం ఆగిపోవడం లేదా పట్టుదలవల్ల జరిపితే వృథా ప్రయాస-భోజన సౌఖ్యం చెడడం-ఆశాభంగం కలుగుతుంది. 16-17 ల్లో ఆరోగ్యం తిన్నగాయుండదు: ఇరుగుపొరుగులతోల్లో పొల్గొనడం అందుల మనస్సునకు బాధ ఏర్పడుతవి. మొత్తంమీద వృత్తి ఉద్యమ ల్లో కార్యక్రమంచాలా నకపడుతుంది.

మిథునం మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర పునర్వసు 1, 2, 3 పాదాలు

ఈ వారంలో జనకంతో వృత్తి ఉద్యమాలు ప్రారంభించుతారు. కాని కుటుంబంలోనివారు తొందరపరచడంవల్ల 14, 15 ల్లో ఆర్థికపరిస్థితులూ పరిష్కారాలూ, వ్రాతలూ చూచుకోవడం కలుగుతుంది. ఉద్యోగ నౌకరీల్లోని అధికారులవల్ల అనుకూలమైన సమాధానం పొందకలుగుతారు. 16, 17 ల్లో అనుకున్న ప్రయాణం ఆగిపోతుంది. వారాంతంలో ఆరోగ్యం తిన్నగా యుండదు.

కర్కాటకం (పునర్వసు 4, పుష్యమి ఆశ్లేష)

ఈవారంలో పరిస్థితులు గతవారంలో కన్నా కొంత అనుకూలంగా యుంటవి 13 ఆప్తులనూ బంధువులనూ కలవడం శుభ సంప్రతింపులు ఉత్సాహకరంగా యుండగలవు. 14, 15 ల్లో ఉద్యోగంలో క్రింది నౌకరీలతో వాగ్వాదం ఎదుర్కొనవలసి యుంటుంది. స్పెక్యులేషన్లో ఎక్కువ నష్టం కలుగుతుంది 16, 17 ల్లో వ్రాతలూ పరిష్కారాలూ లాభకరం.

సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ఈవారంలో 13 మీ వ్యవహారాల్లో ఎక్కువ శ్రద్ధపుచ్చుకొనే ఆప్తులు మౌనంగా యుంటారు. 14, 15 ల్లో ప్రయాణం అధికారులనూ గౌరవస్థులనూ కలవడంవల్ల మేలు కలుగుతుంది. 16, 17 ల్లో సంఘ వ్యవహారాల్లో మౌనంవహించండి, వారాంతంలో పరిష్కారాలూ వ్రాతలూ లాభకరం కాగలవు. మొత్తం మీద గతవారంలో ఆగిన ఆర్థిక సర్దుబాట్లు ఈవారంలో చేయ కలుగుతారు.

కన్య (ఉత్తర 2 3 4 పాదాలు, హస్త, చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో త్వరపడి 13 వ తేదీయే జరుపతగిన పరిష్కారాలు ముగించండి. 14, 15 ల్లో ఖర్చులకు మితియుండదు. ఆప్తులనుకొనేవారు కూడా మిమ్మల్ని చిక్కుల్లో పెట్టిస్తారు. 16, 17 ల్లో ఎదురుచూచే ఆప్తులను కలవడం లేదా వారినుండి సందేశాలూ అను కూలవార్తలూ రావడం జరుగుతుంది. 18. 19 లో కుటుంబ ఆర్థిక పరిస్థితులు ఎటూ కదలనివ్వవు.

తుల (చిత్త 3, 4 పాదాలు. స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో, గతవారం ఆగిపోయిన కార్యక్రమం పూర్తిగా ముగించకలుగుతారు. 13, 19, 20 ల్లో ప్రయాణం—పెట్టుబడులూ ఆప్తులనూ అధికార్లనూ గౌరవస్థులనూ కలవడం లాభకరం. 14, 15 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ ముగించండి. 16, 17 ల్లో ఆప్తులనుకొనువారితో కూడా మీ రహస్యాలను బయలుచేయకండి. వారాంతంల్లో ఆప్తులను కలుస్తారు. శుభవార్తలు అందుతవి.

వృశ్చికం (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)

ఈ వారంలో 13 సంఘకార్యాలూ, ఉద్యోగ-నౌకరీపరిస్థితులూ ఎటూ కదలనివ్వవు. 14,15 ల్లో చేసేప్రయాణం శ్రమతోకూడియున్నా జయప్రదం అవుతుంది. ఆప్తులు ప్రథమంలో కాదనినా చివరకు ఆర్థికసహాయంచేస్తారు. 16,17 ల్లో పరిష్కారాలూ-వ్రాతలూ లాభకరంగా-అనుకూలంగా ముగిస్తవి. 18,19 ల్లో ఆరోగ్య భంగం-అధికవ్యయం కలుగుతుంది.

ధనుస్సు: (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం.)

ఈ వారంలో 13 న మీరు ప్రయత్నించిన వ్యవహారం ఏదీ జయప్రదంగా ముగియదు. 14,15 ల్లో ఎటుపోయినా అపశకునాలకలిగి విసుగుకలుగుతుంది. విశ్రాంతిఅవసరం. కాని పొందలేరు. 16,17 ల్లో ప్రయాణం ఆప్తులను కలవడం. నూతనయత్నం, 18,19 ల్లో పరిష్కారాలూ లాభకరం అవుతవి.

మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు

ఈ వారం పరిస్థితులు ఇరుకైపులా యుంటవి. పరిష్కారాలు పైవారానికి ఆపండి. 18,19,20 ల్లో ప్రయాణం నూతనయత్నం - ఇతరులను కలవడం లాభకరం. 14, 15 ల్లో ఆరోగ్యభంగం ఆశాభంగం కలుగుతుంది. పట్టుదలవద్దు 16 17 ల్లో ఇరుగుపొరుగు పరిస్థితులు విశ్రాంతిని ఇవ్వవు. విసుగు కలుగుతుంది.

కుంభం (ధనిష్ఠ 3,4పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు గత వారంలో కన్నా మేలుగా యుండగలవు. కాని మీ మెదడుకు వేడిని కలిగించే పరిస్థితులు కలుగుతవి. ఇతరుల వ్యాఖ్యానాలకూ శ్లేష సంభాషణలకూ చెవియొగ్గవద్దు 13 పరిష్కారాలు లాభకరం. 14 15 ల్లో 19 20 ల్లో ప్రయాణావకాశాలు మెండుగా యుంటవి. వారాంతంలోనే జరపండి. అంతిరాత్మ మీ స్పెక్యులేషన్. వ్యాపారాలలో ఎక్కువ తోడ్పడుతుంది.

మీనం (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో పరిస్థితులు కొంత ఎగుడుదిగుడుగా యుంటవి. 13, ఆరోగ్యభంగం కలుగుతుంది. 14' 15 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ పెట్టుబడులూ ఎక్కువ లాభకరం కాగలవు. 16 17 ల్లో ప్రయాణం ఇతరులను కార్యార్థపరంగా కలవడం మంచిది. ముఖ్య కార్యక్రమంకూడా 17 సాయంత్రంలోగా ముగించివారాంతంలో విశ్రాంతి పొందండి. 26 శుభవార్త. ఆప్త సమాగమం.

## తిరుపతి దేవస్థానం జమీ బకాయిశిస్తు వసూలు యత్నం

### 3669 దావాల దాఖల్

తిరుపతి, నవంబరు 4: తిరుమల తిరుపతిదేవస్థానం అధికార్లు దేవస్థానం జమీ భూములనుండి 1359 ఫసలీ తాలూకు రావలసిన బకాయి సుమారు రూ 50,000/- రాబట్టుటకు రూ 6300/- ఖర్చుతో 3669 దావాలు చేసియున్నారు. ఆదాయను ఏమీ రాదని తెలిసినప్పటికిన్నీ జమీందారీ చట్టము క్రింద గ్రామాదులను ప్రభుత్వంవారు స్వాధీనం చేసుకొంటారనేది నిమిత్తములేక దావాలు మామూలుప్రకారం దాఖల్ చేయవలెనని రెవిన్యూబోర్డు వారు అన్ని సంస్థలకు ఉత్తర్వులు పంపినందున యీ దావాలు దాఖల్ అయినట్లు తెలియుచున్నది. (స్వ. వి.)

మద్యపాన నిషేధచట్టం అమలులో ఉన్నప్పటికి జింజర్ టింక్చర్ అనే మందు వస్తువు ప్రజలు బాగా ఆకర్షించుచున్నది. కనుక, అధికార్లు జింజర్ టింక్చర్ పైకూడా నిషేధ ఉత్తర్వులు చేయవలయునని చంద్రగిరి యూనియన్ కాంగ్రెస్ కమిటీ వారు ఒక తీర్మానం చేసిరి.

న్యూ థియేటర్సువారి 'ఛోటా భాయ్'లో రామ్‌లాల్ (ఛోటా భాయ్) కోణంగితనం చూపే ఒక సన్నివేశం.

## నగరంలో సినిమాలు

| | |
|---|---|
| సాగర్ | 'ఛోటా భాయ్' |
| బ్రాడ్వే | 'శకుంతల' |
| వెల్లింగ్టన్, ప్రభాత్ | 'అపూర్వ సహోదరగళ్' |
| పారగన్ | 'లైలామజ్ను' |
| స్టార్ | 'దరోగా జీ' |
| క్రౌన్, సన్ | 'మాయామచ్ఛీంద్ర' |
| సినిమాసెంట్రల్ | 'మోహిని' |
| సెలెక్టు | 'జైహనుమాన్' |
| సరస్వతి | 'ఉత్తమ పుత్రన్' |
| సయానీ | 'కన్నియిన్ కాదలి' |
| Casino: | 'Black Magic' |
| Minerva: | 'Tarzan And The Mermaids' |
| New Elphinstone: | 'Mr. Bel vedere goes to College' |
| New Globe: | 'Sowrowful Jones' |
| Roxy: | 'The Loves of Carmen, |

## అద్భుతమైన ఫిలిం "ఛోటాభాయ్"

న్యూ థియేటర్సువారి 'ఛోటాభాయ్' గత శుక్రవారంనుంచీ సాగర్ టాకీస్‌లో ప్రదర్శితమవుతున్నది. హృదయాన్ని కదలించే సన్నివేశాలు గల ఇతివృత్తం కొత్తవారైనా ప్రధాన పాత్రలు నిర్వహించిన నటీనటుల నటనా నైపుణ్యం, ఉచితోపయోగ్యవృత్తిగల గాన, నేపథ్యగానములు, ప్రశంసనీయమైన దర్శకత్వం, నిపుణమైన ఛాయా, శబ్దగ్రహణాలు గల అద్భుతఫిలిం ఇది.

అకళ్ళపోకళ్ళ సన్నివేశాలతో అర్థం పర్థంలేని కథలతో మనోరంజనలో దారిపు సహారా ఎడారివలెవున్న భారతీయ ఫిలిం ప్రపంచంలో ఇదొక, దప్పిగొన్నవారి ఆర్తితీర్చే, కాసారమనవచ్చు.

శరచ్చంద్ర ఛటర్జీ పేరు ఆయనవ్రాసిన 'రామేర్ సమతి' అనే నవల తెలియనివారాంధ్రదేశమంది ఉండరు. బెంగాలు గ్రామాలలో సాధారణ కుటుంబీకుల జీవన విధానాలు, మనస్తత్వాలు, కలతలుఆయన చక్కగా చిత్రించారు నవలలో. దర్శకుడు కార్తీక ఛటర్జీ వాటన్నిటినీ బహు రసవంతంగా ప్రతిబింబించారు. ఈఫిలింలో.

పది పన్నెండేళ్ళ రామ్‌లాల్ శామ్ లాల్‌కు సవతితల్లి కొడుకు. తమ్ముడు శామ్‌లాల్ పత్ని నారాయణి చేతులలో గారాబంగాపెరిగి కొంటెకోణంగి అయాడు. ఆమె అతణ్ణి తన కన్నబిడ్డకంటే ప్రేమతో పెంచుతుంది. అతనికికూడా ఆమెఅంటే అమితభక్తి. అతని కోణంగితనం ఊళ్ళో పలువురికి క్రోధకారణమవుతుంది. దానికంతటికీ నారాయణి గారాబమే కారణమని భర్త కక్కసించుకొంటూంటాడు. ఇట్లావుండగా నారాయణితల్లి వారింట తిష్ఠవేయడానికి వచ్చి, తన అల్లుడిఆస్తితో భాగం పంచుకొంటాడనే ఈర్ష్యతో రామ్‌లాల్‌యెడ ద్వేషం వహిస్తుంది అతని మనస్సుకు కష్టంకలిగించే పనులెన్నో చేస్తూ కొడుకు అల్లుడితో కొండేలుచెప్పి, భాగాలు పంపిణీ చేయిస్తుంది. భర్త నిక్కర్షి చేయడంవల్ల నారాయణి ఏమీ చేయలేక పోతుంది రామ్‌కు ఇది అశనిపాతం అయి, కుమిలి కుమిలి పోతూ ఉంటాడు. నారాయణకూడా పెంచిన ప్రేమతో ఆ స్థితిలోనే వుంటుంది. రామ్ ఈదుస్థితి భరించలేక ఆ వూరువదిలి పోవడానికి బయలుదేరుతాడు. ఈ సంగతి తెలిసి నారాయణి ఇక భరించలేక గబగబా వచ్చి దారిలో అతనిని కలుసుకొని వెనక్కు తీసుకువచ్చి తనదగ్గర చేర్చుకొని, యథాప్రకారం ఆదరిస్తుంది.

రామ్‌గా పహారి, నారాయణిగా మోలినాదేవి అద్భుతంగా నటించారు. పంకజ్ మల్లిక్ సంగీతం బహు శిష్టంగా వుంది.

రామ్ మనస్సు మారేలా 'ఘట్టా' లను చిత్రించడంలో దర్శకుడు మహా ప్రతిభ చూపాడు. ఒక్కమాటలో ఆది నుంచి తుదివరకూ మనస్సును ఆకట్టివుంచే ఇట్లాంటిఫిలిం ఈ మధ్యరాలేదు.

## వాహినీ స్టుడియోస్

వాహినీ స్టుడియోస్‌ను విజయాప్రొడక్షన్సువారు దీర్ఘకాలపు అద్దెకు తీసుకు నిర్వహిస్తున్నారన్నది ఈ పత్రికా పాఠకులకు తెలిసినదే, ఫిలిం నిర్మాతలకు ఈ స్టుడియోస్‌లో పలువిధసౌకర్యాలు, అనుకూల్యాలు అమర్చారు. ఛాయా, శబ్దగ్రహణ పరికరాలు అత్యాధునాతనమైనవి. ఇటీవల రెండు కొత్త 'ఫ్లోరు'లు నిర్మించారు. ఇందువల్ల ఇప్పుడు రెండుయూడు యూనిట్లు ఏకకాలంలో పనిచేయడానికి సావకాశం కలిగింది. ఇంటోఫ్లోర్ నిర్మిస్తున్నారు. ఫిల్ముకాపీలు ప్రింటింగుపని ఒత్తిడి ఎక్కువగాఉండడంవల్ల అదనంగా ఒక ఆటొమాటిక్ లాబొరేటరి నిర్మించారు. ఇంత 'కెపాసిటీ' కల 'లాబ్' ఇండియాలో ఎంకెక్కడాలేదు.

ఈస్టుడియోస్‌లో తయారు అవుతున్న ఒకటి రెండు ఫిల్ములుగురించి ఇదివరకే ఈ పత్రికా పాఠకులకు తెలుసు. వాహినీ ప్రొడక్షన్స్ నెలకొనిననాటినుంచీ అసిస్టెంటు డైరెక్టరుగానూ, 'వేమన'లో కె. వి. రెడ్డిగారితో అసోసియేట్ డైరెక్టరుగానూ పనిచేసిన కమలాకర కామేశ్వరరావుగారు 'చంద్రహారం' అనే ఒక చిత్రానికి స్క్రిప్టు వ్రాస్తున్నారని క్రొత్తగా తెలియవచ్చింది. హిందూస్తానీలోకూడా ఫిల్ములు తీయాలని సన్నాహాలు చేస్తున్నారు.

విజయా ప్రొడక్షన్సుకు బి. నాగిరెడ్డిగారు జీవగర్ర. వారి వ్యాపార దక్షతలో ఈ స్టుడియోస్ దినదినాభివృద్ధిగలదనీ అంధ్రులకీర్తి ప్రతిష్టలను ఫిలిం ప్రపంచంలో నలుదెసలా ప్రసరింపగలదనీ ఆశిస్తున్నాము.

### "క్రౌన్" టాకీస్ 9. వ వార్షికోత్సవం

మద్రాసులోని 'క్రౌన్' టాకీస్ 9. వార్షికోత్సవం మొన్న 9-వ తేదీన న్యాయమూర్తి డబ్ల్యు. ఎస్. కృష్ణస్వామి నాయుడుగారి అధ్యక్షతను జరిగింది. హాలు యజమాని మరుపూడి వెంకట నరసింహులు నాయుడుగారు, హాలు సిబ్బంది అతిథులకు చందన, పుష్పగుచ్ఛములనిచ్చి ఆహ్వానించారు. అల్పాహారానంతరం న్యాయమూర్తి ఉపన్యసిస్తూ క్రౌన్ మద్రాసులో రఘుపతివెంకయ్యనాయుడుగారు కట్టించిన మొదటి నాటు థియేటర్లలో ఒకటనీ, నరసింహులునాయుడుగారు మంచి ఫిల్ములు ప్రదర్శించి ప్రేక్షకులకు మంచి కాలక్షేపం ఏర్పాటుచేస్తూ ఉండాలనీ హితవు చెప్పారు.

## ఫిలింపరిశ్రమలో ప్రభుత్వ జోక్యం

ద. భా. ఫి. వా. సంఘ అధ్యక్షుని పత్రికా గోష్ఠి

దక్షిణ భారత ఫిలిం వాణిజ్య సంఘం అధ్యక్షుడు టి. ఆర్. సుందరం గారు మొన్న 7 వ తేదీన పత్రికా ప్రతినిధులతో గోష్ఠి సలుపుతూ, ఫిలిం పరిశ్రమలో ప్రభుత్వ జోక్యంగురించి తమ అభిప్రాయాలను వెల్లడించారు.

ప్రభుత్వం ఈ పరిశ్రమ సమస్యలను సమ్యంగా అర్థం చేసుకోకుండా ఉత్తరువులు చేస్తూండడం పరిశ్రమకు హాని కలిగిస్తున్నదని, వినోదపు పన్నురేటు విపరీతంగా వుండడము, సెన్సారింగు విషయమై నిర్బంధాలు, ఫిల్ముల పొడవు నిర్బంధాలు డాక్యుమెంటరీల నిర్బంధ ప్రదర్శన ఉత్తరువులు మొదలైనవన్నీ ఇందుకు నిదర్శనాలనీ వారు వివరించారు. ప్రభుత్వం ఈ పరిశ్రమ అభివృద్ధికి, క్షేమానికి ఏమీచేయకుండా ఇట్లాంటి అక్రమ నిర్బంధాలు మాత్రం విధించడం శోచనీయమన్నారు. దక్షిణ దేశంలో చూపే ఫిల్ములు ఉత్తర దేశంలో చూపే వాటికన్నా పొడవు ఎక్కువ వుండాలనిశ్రీవాదించారు.

జెమినీ అధిపతి ఎస్. ఎస్. వాసన్ గారు పత్రికలవారు అడిగిన పలు ప్రశ్నలకు ప్రత్యుత్తరా లిస్తూ ఫిల్ముల పొడవు నిర్బంధమున్నది సహింపరానిదని ఉద్ఘాటించారు.

## "పాలుడ్రిన్" ఔషధి ప్రయోజనంపై చిత్రం

భారతదేశంలో ప్రతిఏడాది పలువురి ప్రాణాలను బలిగొనే వ్యాధులలో మలేరియా ఒకటి. దీని నివారణకు 'పాలుడ్రిన్' అనేమందు చాలాఉపయోగపడుతుందని ప్రచారముచేసే చిన్న ఫిల్ము నొకదానిని 'డాక్యుమెంటరీ యూనిట్ ఇండియా' తరఫున పాల్ జిల్స్ తీశాడు. ఇందులో మలేరియా ఎట్లా వస్తుందో, దానికి మందు తెలియక ప్రజలెట్లా బాధపడతారో, పాలుడ్రిన్వల్ల కలిగేప్రయోజనమేమిటో చక్కగా చూపారు. ఈఫిలిమును ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ (ఇండియా) లిమిటెడ్ వారు మొన్న 2వ తేదీన నగరంలోని పత్రికలవారికి ప్రభుత్వోద్యోగులకు, డాక్టర్లకు, వైద్యవిద్యార్థులకు కెజినో థియేటరులో చూపించారు.

ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్ ఫార్మస్యూటికల్ శాఖకు చెందిన మిస్టర్ డబ్ల్యు. ఎ. వెల్స్ అతిథులను ఆహ్వానిస్తూ మలేరియా నివారణ జాతీయ ఆరోగ్యాభివృద్ధికే కాక ఆర్థికాభివృద్ధికికూడా తోడ్పడగలదని తెల్పారు. మలేరియా నివారణకు అనేక సాధనాలు కలవు. వానిలో "పాల్యూడ్రిన్" చాల శక్తివంతమైన సాధనమని తాము గట్టిగా నమ్మగలుగుతున్నారు. గ్రామాదులకు సులభముగా అందుబాటులో నుండుట దీనిప్రత్యేక లక్షణమన్నారు.

గ్రామసీమలలోకూడా ఈ పటాన్ని ప్రదర్శించడానికి కంపెనీవారు ఏర్పాటు చేస్తున్నారు.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 12:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎక్స్చేంజి బాంబే సిల్వరు టాక్సుతో సహా రు. 77-0-0 సెట్ల బంగారు తులం 115-8-0 మూడవది 114-0-0 సీమ వెండి తులం 10-.. (నాడి 168 0-0 వెండి తులం 1 కి 1-12-0

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎక్స్ కోస్తాగిడ్డంగులు) మిషీన్ (సిల్వరు టాక్సుతో సహా) బజారు రు ,151, 152 వేరుసెనగనూనె ఎక్స్ పెల్లర్ (ఏపరలి) నవంబరు 15 వ డెలివరి రు. 380-0-0 కొంకోయనూనె(87 పౌన్లు గల డబ్బా) ఒకటికి రు. 34-0-9, కొచ్చిన్ 34-8-9, నెమ్మది.

ఆముదం

కాండి 500 పౌనులుగలది రు. 295-0-0

ఆదివారం నవంబరు 13, 1949

సారస్వతానుబంధము

# ప్రధాని పండిట్ జవహర్‌లాల్ షష్టిపూర్తి మహోత్సవం

అమెరికా అక్టోబరు మధ్యలో పండిత నెహ్రూకు ఘనమైన స్వాగతం ఇచ్చింది. అమెరికా ఈ స్వాగతం ఎంతో ఆప్యాయంగాను, ఆనందంతోను ఏర్పాటు చేసింది. ఇలాంటి ఆనందానుభూతి అమెరికాకు ఎన్నడూ కలగలేదు. ఈ ఆనందంలో అనేక భావాలు సమ్మిళితమై ఉన్నాయి. పండిత నెహ్రూను అమెరికావాసులు అనేక విధాలుగా అర్థం చేసుకున్నారు. అమెరికా జనసామాన్యాన్ని అత్యంతము ఆకర్షించినది. సహజమాధుర్యంతో సమ్మిళితమైన నెహ్రూ సరళస్వభావము. లైఫ్ పత్రికలో అప్పుడప్పుడు పడిన ఆయన ఛాయాచిత్రాలు చూచినవారికికూడా యౌవనపూర్ణమైన నెహ్రూ ప్రేమార్ద్రహృదయం అవగతమవుతుంది; అంతేకాదు; ఆయన ఛాయాచిత్రాల ఆకృతిలో సహజమైన ఋజుస్వభావము గోచరిస్తుంది. ఆయనను వ్యక్తిగతంగా చూచినతరవాత ఈ అభిప్రాయం మరింత స్థిరపడుతుంది. ఈ సరళస్వభావము పండితనెహ్రూను అవగాహన చేసుకోవడానికి చాలా సహాయపడింది. ఆసియాకుఅమెరికాకు ఎంతో 'దూరం' గా ఉండుటయే ఇండియా అర్థంకాకపోవడానికి కారణము

అదీగాక అమెరికావారికి ఆసియాను గురించి తరతరాలుగా చిత్రమైన అభిప్రాయాలు ఏర్పడి ఉన్నాయి. అందుచేత సులభంగా అవగాహన చేసుకోవడానికి వీలయినవ్యక్తి అమెరికా రావడం చాలా ఉపయోగకరంగా పరిణమించింది. అమెరికావారికిస్పష్టతస్సిద్ధంగా ఇనపతెరలన్నా, మరి ఏ తెరలన్నా చాలా అయిష్టము. అందుచేత మనస్సులో ఉన్నది ఉన్నట్టు మాట్లాడితే మాకెంతో ఇష్టము. మనస్సులో దాపరికంలేకుండా ఒక్క చిరునవ్వునవ్వి మాటాడితే మాకెంతో ఆనందం కలిగిస్తుంది. అందులోను, ఆ మాట్లాడిన భాష ఆంగ్లభాష అయితే మరి చెప్పనే అక్కరలేదు! ఎల్లాంటి అనుమానాలున్నా ఎప్పటికైనా భూతలస్వర్గం సృజించవచ్చుననే ఆశావాదులయిన నాయకులంటే మాకెంతో ఇష్టము. నెహ్రూలో అమెరికావారు కాంక్షించే ఆదర్శనాయకుని గుణాలన్నీ ఉన్నాయి.

అమెరికా జాతీయ జీవనంలో అమెరికాస్త్రీలకు ఎంతైనా ప్రాముఖ్యం ఉన్నది. ఫీవో కొన్ని ఛాయాచిత్రాలు చూచినంతమాత్రం చేతనే అమెరికాస్త్రీలు పండితనెహ్రూను గురించి ఎంతో ఆప్యాయంగా మాట్లాడడం నేను విన్నాను. అమెరికావారి భావనా జగత్తుకు పండితనెహ్రూవంటి ఆదర్శనాయకులు అన్నివిధాలా తగిఉంటారు. నెహ్రూ అమెరికాలోనే ఉండిపోతే అమెరికావారిని ఎంతో గొప్పగా ఆకర్షించిఉండును. దయార్ద్రమైన చిరునవ్వుతో సన్నగా, నాజూకుగా ఉన్న నెహ్రూమూర్తి అమెరికాస్త్రీలకు అత్యంతము ఆప్యాయంగా ఉండడంలో ఆశ్చర్యంలేదు.

అమెరికా పౌరులు సామాన్యంగా తమ బ్రతుకు తెరువులో నిమగ్నులయి ఉంటారు. జాతీయజీవనంలో తమ జీవితాలకు తారసిల్లే విషయాలను గూర్చి మాత్రమే వీరు బాగా శ్రద్ధ వహిస్తూ ఉంటారు. ఇంతలో ఆసియాఖండం నించి తారాజువ్వలాంటి ఒకవ్యక్తి వచ్చి వారికి సాక్షాత్కరిస్తాడు. ఆ వ్యక్తి నిత్యయవనుడు. అమెరికా పత్రికాప్రపంచము ఈయన భారతదేశానికే కాక ప్రపంచానికంతకీ కూడా నాయకుడని ప్రశంసిస్తుంది. అమెరికాపత్రికలు నెహ్రూకు ఆసియా అంతటిలోను పలుకుబడి ఉన్నదని ప్రశంసించడంవల్ల అమెరికాప్రజలు ఈయనవల్ల ప్రపంచశాంతి చేకూరగలదని భావిస్తుంది. అమెరికా వారందరూ అనుదినము ప్రపంచ శాంతికోసం పరితపిస్తున్నారు. అమెరికాలో చేసే సైన్యవ్యయం అమెరికాపౌరులను అన్యాయాధాల బారినుండి రక్షించడానికై ఉద్దేశింపబడినదే!

ప్రపంచ రాజకీయాల్లో ఇండియా ఆసియాల ప్రాముఖ్యం గుర్తించినవారికి, నెహ్రూ వచ్చినంతమాత్రాన అమెరికా ఒక్కసారిగా ఇండియా ప్రాధాన్యం గుర్తించడము, ఇండియాను అవగాహన చేసుకోవడానికి తహతహపడడము చాలాఆశ్చర్యకరంగాఉంటాయి. కాని అమెరికా మనస్తత్వధోరణే అల్లాంటిది. ఇండియా మొదలైన దేశాలు ఈ సుణం అమెరికా ప్రజాస్వామ్య లక్షణమని అర్థం చేసుకోవచ్చును.

అయితే ఈ విధంగా ఒక్కసారిగా ఆవిర్భవించే జ్ఞానోదయం ప్రతిప్రధానమంత్రి అమెరికాలో అవతరించినంత మాత్రం చేతనే కలగడం లేదు. నెహ్రూ వల్ల అమెరికాలో భిన్నభిన్నమైన శక్తులు ప్రసరించాయి. నెహ్రూ, అమెరికావారు లిములో భారతదేశం దర్శించగలిగేటట్లు చేశారు. 19వ శతాబ్దంలో అమెరికావారికి భారతదేశం ఒక వైరాగిలా కనిపించేది. 20వ శతాబ్దంలో భారతదేశాన్ని మధురభాషిఅయిన టాగూరు మహాకవిగా అవగాహన చేసుకున్నాము. ఆ పిమ్మట అమెరికావారికి ఇండియా గాంధీలాగ, ఆయన ఆత్మార్పణంలాగ కనుపించింది. అమెరికావారు నెహ్రూలో నవీనంగా స్వాతంత్ర్యం సంపాదించిన భారతదేశమును సందర్శించగలిగారు. స్నేహార్ద్రమైన నెహ్రూ ముఖం సందర్శిస్తే, క్రమంగా ప్రపంచంలో దేశాలమధ్య సామరస్యం ఏర్పడి శాస్త్రపరిశోధనలద్వారా సంపదభివృద్ధిజరగగలదనే ఆశకల్గుతుంది.

నెహ్రూ, అమెరికా రావడంవల్ల కలిగిన ఫలితాలు అమెరికా ప్రజల భావోద్రేకాన్నిబట్టే గ్రహించవచ్చును. వీరందరు చదువుకున్నవారే. అయినా వీరికి ప్రపంచరాజకీయాలు ఏమీ తెలియవనే చెప్పవచ్చును. ఈ విషయంలో ఇండియా వైఖరూ, వీరూ ఒకటే. అయినా వీరిదగ్గర ఉన్న ఎన్నిక హక్కునుబట్టి వీరందరు చాలాశక్తిమంతులనే చెప్పాలి. నిరుటి సంవత్సరం విజ్ఞులంతా ఎన్నికలలో ట్రూమనుకు అపజయం కలుగుతుందని అనుకున్నారు. కాని అంతగా విద్యావంతులుగాని ఈ అమెరికా ప్రజాసామాన్యమే ట్రూమనును గెలిపించారు. వీరందరు ఒక సహజభావనతో ట్రూమనును గుర్తించి ఆయనను ఎన్నుకున్నారు. ఇది వీరు గొప్ప వివేచనశక్తితో చేశారని అనడానికి వీల్లేదు. అయినా వీరందరివద్ద ఉన్న ఎన్నికశక్తి చాలా గొప్పది. నెహ్రూ తమ వ్యక్తిప్రభావం వల్ల అమెరికా వారి దృష్టిని ఎక్కువగా ఆసియా వైపు తిప్పగలిగారు. దీనివల్ల అమెరికా ఇతోధికంగా

## విలియమ్ డి. ఎల్లెన్

"వరల్డు ఇన్ బ్రీఫ్" పత్రికా సంపాదకుడు

ఆసియా వ్యవహారాల్లో పాల్గొన గలదని భావించవచ్చును.

అదృష్టవశంవల్ల నెహ్రూ అమెరికాలో మాట్లాడినదంతా రేడియోలో ప్రసారితమయింది. అమెరికా ప్రజలు రాత్రింబగళ్లు తమ పనులలో మునిగి ఉంటారు, అందుచేత వారాయన ఉపన్యాసాలకు స్వయంగా రాకపోయినా రేడియోలో నయినా వినడానికి వీలుకలిగింది. నెహ్రూ వాణిలో సునిశితమైన మాధుర్యము, కాలవిహీనమైన గానము, జాలువారుతూ ఉంటాయి. భయవిరహితమైన ఆ వాణి అందరికీ మహోత్సాహం కలిగిస్తుంది.

అదేగాక ఆయన అమెరికా ప్రజలకు నచ్చేటట్లు ఎంత సరళంగాను, మధురంగాను ప్రసంగించారు. లక్షలాదిఅమెరికా ప్రజలకు ఆ ఉపన్యాసాల వల్ల ఒక నూతనోత్తేజం కలిగింది. అది వారెన్నటికీ మరిచిపోలేరు. వారు అప్పుడప్పుడు ఇండియాను గాని, నెహ్రూను గాని విస్మరించినా, నెహ్రూ ఉపన్యాసాల వల్ల మంచి సుస్థిరమైన శాంతిప్రియత్వం ఏర్పడినదని చెప్పవచ్చును.

జవాబుదారీలు వహించ వలసిన అగ్రనాయకులు ఎంతో ఉత్సాహంతో ప్రసంగింపక పోవచ్చును. కేవలము పత్రికలలో పడిన అభిప్రాయ ప్రకటన వల్ల పరస్పర సహాకారము వీలవుతుందని అనిపించక పోవచ్చును. ప్రపంచ పరిస్థితులు ప్రతి దేశంలోనూ ప్రజల మనస్సును అతిత్వరితంగా మార్చి వేస్తున్నాయి. ప్రెసిడెంటు ట్రూమను ఏర్పరచిన చతుస్సూత్ర ప్రణాళికను వాణిజ్య ప్రముఖులందరు అతి శ్రద్ధగా గమనిస్తున్నారు. ప్రెసిడెంటు ట్రూమను తన ప్రణాళికలో వెనకబడిన దేశాలకు ఆర్థిక సహాయము సాంకేతిక సహాయము చెయ్యాలని సూచించారు. అమెరికా పెట్టుబడిదారులు వాణిజ్య ప్రముఖులు, స్వీయక్షేమం కోసమైనా ప్రపంచంలో తమ సాంకేతిక రహస్యాలు వెల్లడించాలని చూస్తున్నారు. ప్రపంచంలో ప్రతిదేశంలోను కార్మికులు తమకు ఎక్కువ వేతనాలు కావాలని ఆందోళన చేస్తున్నారనీ, కొంత స్వార్థత్యాగం చేస్తేనే గాని తమకు, భవిష్యత్తుండదనీ ఈ వాణిజ్య ప్రముఖులు గ్రహించారు. అదీగాక వీరు కార్మికులు ఎక్కువగా తమ సరుకులు కొనగలరని కూడా గ్రహించారు. భారతదేశం ఆసియాలో ప్రముఖదేశమనీ, ఆదేశంతో స్నేహ సంబంధాలు ఏర్పరుచుకోవడం అత్యవసరమనీ కూడా వీరు గ్రహించారు.

నెహ్రూ అమెరికాను సందర్శించే సమయానికి అమెరికా పాశ్చాత్య ప్రపంచాన్ని కనుగొన్న కొలంబస్ జన్మదినోత్సవం జరుపుతుంటున్నది. ప్రెసిడెంటు ట్రూమను పండిత నెహ్రూకు స్వాగతం చెబుతూ, 'కొలంబస్, భారత దేశానికి మార్గం అన్వేషించాలనుకుంటూ అమెరికాను కనుగొన్నాడనీ, నెహ్రూ సందర్శనం కూడా అమెరికాను కనుగొనడానికి తోడ్పడ గలదనీ చెప్పారు.

నిజానికి అమెరికా ఆధునాతన ప్రజాస్వామ్యాల కన్నింటికీ ఉత్పత్తి స్థానం. నెహ్రూ అమెరికాలో సమర్థులైన నాయకులను, వారు సాధించిన కార్యములను చూచి, ఒక వినూత్నానుభవంతోను, ఉత్సాహంతోను స్వదేశానికి తరలగలరని భావిస్తున్నాను. అమెరికాదృక్పథాన్నిబట్టి చూస్తే నెహ్రూరాకవల్ల ఇండియాకు ఆర్థికంగా లాభం చేకూరగలదని తోస్తున్నది. ఈ రాకవల్ల అమెరికా వారికి ఇండియాఅవసరాలను తీర్చవలసిన అగత్యం ఏర్పడింది. ఇండియాకు సహాయం చెయ్యడంవల్ల ప్రపంచార్థిక సౌష్ఠవం ఏర్పడగలదని అమెరికావారు గ్రహించారు. ఇండియాకూఆగ్నేయాసియాలో కమ్యూనిజం వ్యాప్తికి తోడ్పడనేనమికావాలని కూడా అమెరికావారు ఆశించారు.

నెహ్రూరాకవల్ల అమెరికా వారికి ఇంతకు పూర్వం ఇండియా విషయమై ఏర్పడిన అశ్రద్ధ తొలగిపోగలదనీ, దీనివల్ల అమెరికా నాగరికత పెంపొందించడానికి వీలవుతుందనీ, నేను అత్యుత్సాహంతో ఆశిస్తున్నాను. అందుచేత అనారోగ్యము, దారిద్ర్యము మొదలైనవి తొలగించడంలో ఉభయ దేశాలు సోదర భావంతో సహకరించగలవనీ ఇది విధివిధానమనీ నేను భావిస్తున్నాను.

వ్యక్తిగతంగా పండితనెహ్రూ జన్మదినోత్సవమైన నవంబరు 14 నా కెన్నో మధురస్మృతులను కలిగిస్తున్నది. లాహోరు కాంగ్రెసు సందర్భంలో పండిత నెహ్రూ ఆహ్వానంపై నేను లాహోరు వెళ్లాను. అప్పటి కాయన కాంగ్రెసు కార్యదర్శిగా ఉన్నారు. తరవాత ఒక జర్మను మిత్రుని సహాకారంద్వారా నాకు ఆ సమావేశంలో కాంగ్రెసు దస్తావేజులను పరిష్కరించి ప్రచురించే అవకాశంకూడా కలిగింది. నేను ఆరోజుల్లో మోతీలాల్, జవహర్లాల్ నెహ్రూలతో కలిసి టీ తీసుకున్న మధుర క్షణా లెన్నటికి మరిచిపోలేను. ఆతరవాత నేను గాంధీజీని లాహోరులో కలుసుకున్నాను; శాంతి నికేతనంలో గురుదేవులను దర్శించాను. అప్పటినించీ నేను ఇండియా అమెరికాల మధ్య సన్నిహిత సంబంధానికీ, సాంస్కృతిక పరిచయానికీ బాగా ప్రయత్నించాను. అప్పటినించీ నేను సౌందర్య స్రష్టయైన రవీంద్రుని, నైతిక జీవిత స్రష్టఅయిన గాంధీజీని నిత్యము స్మరిస్తూనే ఉన్నాను. పండితనెహ్రూ వీరిద్దరు పండించిన పంటను జాగ్రత్తగా నూర్చి, భద్రపరిచారు, మనం అందరము ఆఅమూల్య ధాన్యరాసులను సంపర్కించి అవగాహన చేసుకోవడం ఎంతైనా అవసరము.

నిత్యయావనులైన పండితునికి ఇంకా అనేకమైన జన్మదినోత్సవాలు జరగాలని ఆశిస్తున్నాను. పండిత నెహ్రూ అత్యంత మధురవ్యక్తి; సహజ సారళ్యం ఆయనలో మూర్తీభవించినది. ఆయన నూత్న ప్రపంచ వ్యవస్థకు, నూత్న భారతావనికి సజీవ చిహ్నము. ఈ మహావ్యక్తివల్ల ప్రపంచ క్షేమం పెంపొందగలదని నా ఆశ.

## వందేమాతరం!!



# ద్వితీయ జాతీయ సమర నాయకత్వానికి పండిట్ నెహ్రూకు ఆహ్వానం

ప్రధాని నెహ్రూ తన అధికారస్థానానికి బానిసై, స్తబ్ధంగా పడివుండటమేనా? లేక, తన చుట్టూవున్న పరిస్థితులను అధిగమించి, ప్రజలను ఆర్థికదుస్థితినుంచి ఉద్ధరించటానికి ద్వితీయ జాతీయ సమరాన్ని ప్రారంభించి నాయకత్వం వహించగలడా?- నెహ్రూవల్ల చైతన్యోత్సాహాలను పొందిన వేలాది స్త్రీ పురుషులు, ఆయనయందుండే భక్తి ప్రపత్తులను పురస్కరించుకుని ఈ ప్రశ్నను నేడు వారి సముఖాన వుంచుతున్నారు,"—అని సుప్రసిద్ధ సోషలిస్టునాయకులు అచ్యుత్ పట్వర్ధన్ ఈ వ్యాసంలో ప్రతిపాదించుతున్నారు.

## శ్రీ అచ్యుత్ పట్వర్ధన్

యౌవ్వనం వయస్సుకు సంబంధించింది గాదు—అయా వ్యక్తుల జీవన పద్ధతుల మీద అధారపడివుంటుంది. జీవితానుభవం కలిగినకొద్దీ ఉజ్వలాతియుజ్వల మౌతూ వుండే ప్రతిభను యౌవ్వనమంటారు. క్రొత్త సమస్యను పాత పరిష్కారం క్రిందికి మార్చి వేయగల సమర్థతనే వయోవృద్ధి అంటారు. యౌవ్వనమంటే కార్యరంగానికి ఉరుకగల సాహసం; కార్యాచరణద్వారా, అజ్ఞాతంగా వున్న అనేక ఆశయపథాలను ద్యోతమానం చేయటం. ఈ అర్థంలో చూచుకుంటే, 60 సంవత్సరాలు పైన బడినా ప్రధాని నెహ్రూ, దేశంలోని నాయకులందరిలోనూ యువనాయకుడని చెప్పవచ్చును. వెనుదిరిగి 1929 వ సంవత్సరంపైపు చూసుకుంటే, నాడు ఉప్పెనలు లేగిపోయిన లాహోరు కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించి, యువభారతాశయాలన్నిటికి దర్పణంగా నిలుచున్నారు. అధిగమించరాని గడ్డుదినాలు అడ్డు నిల్చినకొద్దీ ఆయన అంతకంతకు అజేయుడై పైకి లేచారు. స్వాతంత్ర్యకాముకులు దీపికలన్నిటమీదా అంధకారం మావరించిపోయిన యీనాడుకూడా, జవహర్‌లాల్ నెహ్రూ కించిత్తు వెలుగురేఖలా కనుపించుతున్నారు. ఈ ఆశారేఖ యెన్నటికైనా ప్రజలకు ఫలించుతుందో, లేక అందుకోరాని మృగతృష్ణలా, దూరంగా అలానే అనంతంగా నిలచిపోతుందో ఊహించలేం. అలాంటి ఆశారేఖగా కనుపించుతున్నారు గనుకనే, ఈ అంధకారదుర్దశలో యువ వయోవృద్ధులు సర్వులూ ఆయనవంక ఆశాదృక్కులు పరపుతున్నారు.

జవహర్‌లాల్ నెహ్రూకు ధైర్యసాహసాలకొరత యెప్పుడూ లేదు. ఏ ప్రమాదంలోకి ఉరకాలన్నా ఆయన సర్వధా సిద్ధమే. కష్టనిష్ఠురాలను ఓర్చటానికి ఆయన యెప్పుడూ వెనకాడలేదు. ప్రమాదం యెదురైనప్పుడు వెనకాడిందీ లేదు. అయితే ఒక చిక్కు వుంది—ప్రతిబంధకాలుగా తయారయ్యే సహచరవర్గాన్ని ఆయన చేదించుకోలేదు. సహచరవర్గాల ఊగిసలాటలు ప్రారంభమైనపుడు వాటిముందు, ఇట్టే మెత్తబడిపోతాడు.

నెహ్రూ అధికార గౌరవాలకోసం వెంపరలాడే వ్యక్తికాదు. వాటంతటికవే ఆయన్ను ఆశ్రయించినై. ప్రతిభా ప్రతాపాలు లేకుండానూ, కార్యదక్షత లేకుండానూ, గాలికి పైకివచ్చిన వ్యక్తి కాదు. అవసరంపట్టినప్పుడుతన సర్వస్వాన్ని అగ్నిసజ్వాలలో విసరివేయటం, ఒక ఆశయం కొరకు పోరాడవలసివచ్చినప్పుడు తన అగ్రస్థానాన్ని సహితం త్యాగంగా విసిరివేయటం, ప్రమాదపరిస్థితులు యెదురైనప్పుడు నిర్భయంగా వాటిని యెదుర్కోటం ఇవన్నీ ఆయనకు జన్మతో వచ్చిన సహజగుణాలు; వీటిని కార్యరంగంలో అనేకపర్యాయములు ప్రదర్శించాడు. ఇలాగే ఆయన ప్రతిభకు కొన్ని అవధులూ వున్నాయ్. ఈ అవధులు కూడా ఆయన విజయపరంపరనుంచి జన్మించినవే. మిత్రత్వాన్ని ప్రతిఘటించి ఆయన నిల్చోలేదు. సలహాలు కూడా వుంచేగాని ఆయనకు ఉత్సాహం వుండదు. ఏకాకిగానిలచి ముందుకు నడవటమంటే ఆయనకు తోచదు. ఈ సహచర వర్గంలోవచ్చే ప్రతిఘటనవంతా యీయన దాకా రానీకుండా మహాత్ముడు సర్దుకుంటూ వచ్చేవారు.

మహాత్ముడు బ్రతికి వున్నంతకాలం, కాంగ్రెస్ వ్యవస్థా నిర్మాణానికి సంబంధించిన సమస్యలన్నిటిని వారిమీద వదలి నెహ్రూ నిశ్చింతగా వుండేవారు. తాను కేవలం బయటినుంచి వచ్చే తాకిడీని యెదుర్కోవటానికి ముమ్మొనలో నిలచి వుండేవారు. జైల్లో, వేళ్ళతరబడి ఒంటరిగా కారాగారాన్ని అనుభవించటం ఎంతవారికైనా క్రుంగదీసి నిరుత్సాహ పరుస్తుంది. కాని నెహ్రూకు మాత్రం అది ఒకవిధంగా ఉపకారం క్రింద పరిణమించింది. సహచరవర్గాల బలహీనతలు ఊగిసలాటలు వాటిని నివ్వరించవలసిన బాధలు ఆయనకు లేకుండాపోయినై. గాంధీజీ జీవించి వున్నంతకాలం, అనుచరవర్గాలలోని అధికారవాంఛల ప్రాకులాటలను ఖండించవలసిన అవసరం ఆయనదాకా వచ్చేదికాదు. ఆ బాధంతా గాంధీజీ.పడుతూవుండేవారు. ఒకవిధంగా, ప్రతిఘటన దినాలన్నీ ఆయన వీరధర్మానికి సంతోషదాయకంగానే వుండేవి. ప్రతిఘటనావసరం యెక్కువగా కనుపించినకొద్దీ, అనుచరవర్గాలలో అధికారవాంఛలు యెక్కువగా పెరిగే సావకాశంకూడా వుండేది కాదు.

నెహ్రూ కేవలం రణోత్సాహి; స్వాతంత్ర్యప్రాప్తితో అనేక యితర సమస్యలను యెదుర్కోవలసి వచ్చింది. గాంధిజి నిర్యాణంతో ఈ బాధలు మరింత ప్రబలమయినాయి. మానవుడు యే ఉత్కృష్ట కార్యాన్ని సాధించాలన్నా చుట్టూవున్న పరిస్థితులు అనుగుణంగా వుండాలని యెరిగిన ఆచరణవాది నెహ్రూ. స్వాతంత్ర్యలబ్ధి తుదిలక్ష్యంగా ఆయన యెప్పుడూ అనుకోలేదు. సామ్రాజ్యవాదంయొక్క దుష్ఫలితాలను నిర్మూలించటానికి బలప్రయోగమైన సాధనం మాత్రంగానే ఆయన దాన్ని పరిగణించారు. తెల్లవాళ్ళ ప్రతిభావంకూడా ఆ స్థాయి కొన్ని ఆయన్నెప్పుడూ అంగీకరించలేదు. ఇతరులకంటే తన ప్రజలనే తెలిసినవారన్న సంగతి ఆయనెన్నడూ అంగీకరించరు. ఆయన మానవత్వ సోషలిజానికి అలాంటి స్వభావాదనలు వ్యతిరేకం. క్రొత్త అరకాశాలను దారితీయగలదిగానూ, సాంఘికంగానూ ఆర్థికంగానూ ప్రజలలోవుండే, ప్రమాదకరమైన ఈ మిశ్రుపల్లాల హింసాకాంక్షను నిర్మూలించటానికి సాధనంగానూ, రాజకీయ స్వాతంత్ర్యలబ్ధిని ఆయన ఉపలక్షించారు. సాంఘిక సాంప్రదాయపు మృత్యుహస్తంలో నలిగిపోయిన లక్షోపలక్షల యీ ప్రజానీకాన్ని ఉద్ధరించి పైకితెచ్చుకోవటానికి సాధనభూతం కానినాడు, స్వాతంత్ర్యమనేది అర్థంలేని పిచ్చిమాట. ఈ తిరగటిరాళ్ళలో నలిగిపోకుండా ప్రజలను కాపాడలేనినాడు స్వరాజ్యమనేది వట్టి నేతిబీరకాయ.

ఇన్ని వాట్లూ, ఆర్థికంగావున్న ఈ నీచమైన మిశ్రు పల్లాలూ, వయోజనవోటింగువల్ల కలిగే లాంఛనప్రాయమైన సమానత్వమూ, ఇవి రెండూ, ఏకకాలంలో ఒకదానిప్రక్క ఒకటి శాంతిగా మనలేవని నెహ్రూ అవగాహన చేసుకునేవున్నారు. చరిత్రకారుని నిశితదృష్టితో ఈ యావత్తు విషయాలనూ ఆయన సమగ్రంగా అర్థంచేసుకునేవున్నారు. శాస్త్రీయమైన సోషలిజమును అనుసరించేవారిలో తాను ప్రథముణ్ణని నెహ్రూ అంటారు; అలాటి పరిస్థితిలో, తాము అమలుజరుపుతున్న ఈ అక్రమమైన సాంఘికపరిపాలనా వ్యవస్థవల్ల వచ్చే దుష్ఫలితాలనుంచి ప్రజలు రక్షించబడలేరనే సంగతిని ఆయన కాదనలేరు. ప్రజలలోవుండే యీ దుస్థితి యావత్తూ ఇలానే కొనసాగుతూవుండాలని యెవరే మిట్టవేదాంతాలు చెప్పినా ప్రయోజనం వుండదు. ఈనాడు నెహ్రూ, ఒక కాలు బానిసత్వంలోనూ, రెండోకాలు స్వాతంత్ర్యంలోనూ శేసివదుస్తున్న ప్రభుత్వానికి నిర్నేతగావున్నారు. ఈ ప్రభుత్వం తనకున్న నిర్ణీతమైన బాధ్యతలన్నిటినీ నిర్వర్తించటానికి జంకుతూ, ధనికవర్గాల ప్రయోజనాలను సమర్థించటానికి పూనుకుంటున్నది. నెహ్రూ తన భవిష్యత్ మార్గాన్ని తాను నిర్ణయించుకోవలసిన కూడలి స్థానానికి వచ్చారు.

నెహ్రూ తన ప్రభుత్వంయొక్క ధనికవాద పద్ధతులతోనూ, పెద్దపెద్ద వ్యాపార సంస్థలమీద ఆధారపడి నడుస్తున్న ఆర్థిక విధానాలతో చేతులైనా కలపాలి, లేదా, పాతివ్రత్య నటనలతో తన ప్రభుత్వం చాటున మూగిన దుష్టశక్తులన్నిటిమీద సవాలు విసరన్నా విసరాలి. భారతదేశం నేడొక ఆర్థిక సంక్షోభ మహారణ్యంలో నడుస్తోంది. దీన్ని గమనించటానికి దివ్యదృష్టి అక్కర్లేదు. ప్రధాని నెహ్రూ ఈ అధోగతిని అరికట్టడానికి కేమైనా ప్రయత్నించుతారా?

దేశంలోని ధనిక శక్తులు, ఈ ప్రజాస్వామికాన్ని కుదుర్లోనే కుళ్ళబెడుతున్నది. ఇది బట్ట బయలుగా వున్న వ్యవహారం, దీనికి పెద్ద నిరూపణలంటూ అవసరంలేదు. ఈ ధనికవర్గాల ఆధిపత్యాన్ని తొలగించటానికి నెహ్రూ, ఆయన ప్రభుత్వమూ తీసుకోదలచిన చర్యలేమిటి? లక్షోపలక్షల ప్రజా హృదయాలలో ఈ ప్రశ్న దైనం దినం ఉదయించుతున్నది. నెహ్రూ యీ ప్రశ్నకు తగిన సమాధానం యివ్వవలసి వుంది.

అంతర్జాతీయ వ్యవహారాలలో భారతదేశం ఆక్రమించుతూన్న స్థానాన్ని గురించి ఆయన యెంత గొప్ప చెప్పినా, శాంతి మార్గాలను గురించీ, యుద్ధ కారణాలను గురించీ ఆయన యెంత చక్కగా ముచ్చటించినా, నేడు అటంబాంబుకంటే ప్రమాదకరమైన సవాలు శాంతిని భగ్నపరచబోతున్నది. ఈ విధ్వంసక శక్తి సాంఘికంగా వున్న ఈ మిశ్రుపల్లాల నాశనాలలోనుంచీ ప్రభవించుతున్నది. నెహ్రూ యీ సమస్యను గురించి శ్రద్ధ వహించవలసిన తరుణం ఆసన్నమైంది.

'నెహ్రూకు దూరదృష్టి వున్నదా, లేక కేవలం కార్య సూరుడేనా? అనే ప్రశ్న వుంది. బలవత్తరమైన సామ్రాజ్యవాదంతో తలపడుతున్న కాలంలో నెహ్రూ వెలుగు శిఖరంగా నిల్చిని సవ్యసాచీ మార్గదర్శకులుగా వున్నారు. యథార్థంగా కార్య దక్షతతో పాటు దూరదృష్టిని సహితం ప్రదర్శించ గలరనే, ఆయనకు 60వ సంవత్సరం ప్రవేశించిన యీ సన్నివేశంలో మనం ఆశించవలసి వున్నది.

పరాయి ప్రభుత్వంతో పోరాటాన్ని సాగించిన కాంగ్రెస్ సంస్థ నేడు ఒక భగ్న వేణువులా వున్నది. దానిలో నుంచి ఇక నిర్మాణ మంజునాదాలు ప్రభవించే సావకాశమేమీ లేదు. జాతిలో వుండే వైవిధ్య శక్తులను సన్నిహిత పరుపగల శక్తి దానికి పోయింది. ఆదర్శము వ్యక్తుల కంటే గొప్పదని నచ్చ చెప్పగల శక్తి నశించింది. కాని యేయే మహాపురుషుల రక్త నాళాలలో నుంచి ఈ కాంగ్రెస్ సంస్థ ఉదయించిందో వారంతా యింకా సదయ హృదయులుగానే వున్నారు.

అధికారానికి దాసులై పడివుండటం వల్ల లభించే అధికారసంపదలను నెహ్రూ గర్హించే వారు. అందుచేత నిరాశ్రయుడైయున్న సామాన్య పౌరుడు ఇంకా నెహ్రూ వంక ఆశతో చూడటం జరుగుతున్నది. జవహర్‌లాల్ నెహ్రూ గాంధీజీకి వారసుడు కాని ఆయనకూ యీయనకూ కొంత తేడావుంది.

నెహ్రూ సాంఘిక సత్యాన్ని ఉపాసిస్తున్నారు. నిర్లిప్తమైన సత్యాధిదేవతకూ మెరమెచ్చుల యిచ్చకాలకూ సంబంధం లేదు. ఏసెల కాసెల దేశంలో యే మార్పూ జరగటానికి వీలులేకుండా ఉచ్చులు మరింత బిగుసుకుంటూన్నయ్. దీంతో దేశానికి వున్న కొనప్రాణం కూడ కడబడుతూంది.

మహాదుస్థితు లనుభవించుతూ పడివున్న యీ 35 కోట్ల జనం, అనేక భాషలు నేర్చి కూడా తనగోడు చెప్పుకోలేని అసమర్థతలో మూగవోయి పడివుంది. తన స్వాతంత్ర్యపు దీపిక లన్నీ ఇలా ధనికవర్గాల బానిసత్వం క్రిందికి పరిణమించటం చూసి కన్నీరు నించుతున్నది. తక్షణం సోషలిస్టు ఆర్థిక వ్యవస్థను నిర్మాణం చేసి, వ్యక్తుల యాజమాన్యాన్ని వీలైనంత త్వరలో అంతం చేయాలి. దేశం యొక్క సహజ సంపదల ప్రతిఫలం జనబాహుళ్యానికి అందేలా చేయాలి. నెహ్రూ జాతీయ పునర్నిర్మాణానికి కావలసిన యావత్తు వివరాలూ సేకరించారు. యావత్తు పథకాలూ తయారు చేయించి యెంతో ముందంజ వేశారు. కాని యీనాడు యివన్నీ పాతకాయితాల వస్తాలక్రింద చదులు తింటున్నాయి. వాటికన్నిటికీ వాయిదాలు తీరుతున్నాయ్. నెహ్రూ నేడు ఎంతో అత్యున్నతమైన అధికార కీర్తులను పొందివున్నారు. ఈ పీడిత ప్రజానీకంయొక్క రక్షణార్థం, దుష్టశక్తులమీద దండయాత్రను సాగించినప్పుడే, ఆయన అధికార కీర్తులకు ప్రయోజనమంటూవుంటుంది.

అగ్రస్థానాలాక్రమించి అక్రమాలకు పూనుకుంటున్న ఈ దశాలను ప్రతిఘటించి అచంచలుడైనిలబడటానికి నెహ్రూ సిద్ధంగా వున్నారా? ఈ నోపిడీ కక్షల దండయాత్రల నుంచి ప్రజల్ని రక్షించటానికి కంకణం పూనగలడా? లేక తన అధికార స్థానంలో బందీకృతుడై, నిస్సహాయ స్థితిలోపడివుండదలచారా? ఈఅధిక లాభ పిశాచా పరులైన ఈ పెట్టుబడిదారులు, వ్యాపారస్తులూ ఉన్నత స్థానాలలో అధిష్ఠించి పన్ను లెగగొడుతున్నారు, ప్రజలను కష్టాలనా లెదుర్కోటం సావకాశంగా తీసుకొని లక్షోపలక్షలుమూటలు గట్టుకున్నారు—ఈ అన్యాయార్జిత విత్తాన్నంతా దాచిపెట్టి, జాతీయ పారిశ్రామికాభి వృద్ధికీ వాణిజ్యాభి వృద్ధికి సావకాశంలేకుండా అరికట్టి బైటాయింపు సమ్మెచేస్తున్నారు. ఇట్టివారి సహాయ సంపత్తులతోనేనా, నెహ్రూ, దేశాన్ని తలమునకలు చేస్తున్న దారిద్ర్య దుర్భిక్షాన్ని యెదుర్కోదలచింది? లేక చుట్టూ తన్ను ఆవరించివున్న ఈ కిరాత పరిస్థితులను విదల్చుకొని, తనప్రభుత్వ దిగ్బంధపు ఉక్కుపిడికిలినుంచి తప్పించుకుని అజేయంగా పైకిలేచి, ఆర్థికవిముక్తి కొరకు ద్వితీయ జాతీయ సంగ్రామాన్ని ప్రారంభించగలరా?

ఆయనవల్ల చైతన్యావేశాలు పొందిన వేలాది స్త్రీపురుషులు, ఈ నాడు, ఆయనయందుండే గౌరవ ప్రపత్తులను పురస్కరించుకుని, ఈ ప్రశ్నను పండిట్ నెహ్రూ సముఖాన వుంచుతున్నారు.

28 లక్షల ఖర్చుతో నిర్మింపబోవు పశ్చిమగోదావరిజిల్లా హెడ్‌క్వార్టర్సు హాస్పిటల్‌కు అక్టోబరు 23 వ తేదీని, మదరాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖామంత్రి డాII టి. ఎస్. ఎన్. రాజన్‌గారు శంకుస్థాపన చేయుచున్న దృశ్యం.

బొంబాయి యవాల్కార్ స్టుడియోవారు ఢిల్లీలో ఏర్పాటుచేసిన శ్రీమతి సుశీలా యవాల్కార్ గారి శిల్పచిత్రకళా ప్రదర్శనకు కేంద్రమంత్రి గాడ్గిల్ గారు గత గురువారంనాడు ప్రారంభోత్సవం జరిపారు. గాడ్గిల్ సుశీలా యవాల్కార్ (ఎడమవైపు) తయారుచేసిన 'మాతాశిశువులు' ప్రతిమను పరిశీలించుట చిత్రంలో కానవసును.

# స్టాలిన్ చేతి తురుపు జోకర్

## శ్రీ ఎమ్. ఎన్. రాయ్

ఇంచుమించుగా ప్రపంచంలో సగం భూభాగంమీద రష్యావారికి ప్రాభవంవచ్చింది. అందుచేత ఈ ప్రైవలా ముంచుకువస్తూన్న ప్రపంచ మహాయుద్ధంలో ఎలాంటి ఎత్తులు వెయ్యాలన్నా వారికి సాధ్యమవుతుంది. కమ్యూనిస్టులు చైనాను జయించడంతో వారికి మరింత బలం వచ్చింది. గడిచిన కొలది దినాలలో పసిఫిక్ సముద్రతీరంవరకు వ్యాపించిన యూరేషియా భూభాగంలో గంపు కమ్యూనిష్టు ప్రభుత్వాల స్థాపన జరిగింది.

క్రమంగా రష్యాప్రభావం అట్లాంటిక్ సముద్రతీరంవరకూ గూడా వ్యాపించే సూచనలు కనిపిస్తున్నాయి.

పీకింగ్‌లో కమ్యూనిష్టు ప్రభుత్వ స్థాపనవల్ల సమీప భవిష్యత్తులో పెద్ద మార్పేమీ రాకపోవచ్చును. రష్యావారికి తూర్పు యుద్ధరంగం భద్రతనుగురించి ఆత్రపడవలసిన అగత్యంకూడా ఏమీ లేదు. అమెరికా దూర ప్రాచ్య సమస్య విషయంలో యుద్ధరంగంలో ఉరకడానికి వెనకంజవేసింది. అందుచేత చైనాను కమ్యూనిష్టు వ్యాఘ్రాలకు వదిలివేసేసినట్లైంది. కమ్యూనిస్టులు చైనాను క్రమక్రమంగా జీర్ణించుకోవాలని చూస్తున్నారు. ఈ ఒక్క కారణంవల్ల చైనా విజయం ఆలస్యం అవుతున్నది గాని, అంతకంటె వేరే కారణం ఏమీలేదు. అదేగాక చైనా కమ్యూనిస్టులు తొందరపడవలసిన అవసరంకూడా ఏమీలేదు. జాతీయచైనాకు పరపతి పూర్తిగా మంటగలసిపోయింది; అందువల్ల జాతీయచైనా పరాజితమైనట్లే భావించవచ్చును. కమ్యూనిస్టులు జయించకుండా విడిచివేసిన భాగాలను ఆక్రమించుకోగల రాజ్యంకూడా ఏదీ లేదు. కమ్యూనిస్టులు జయించేవరకు ఈ భూభాగాలు అన్నీ అరాజకపరిస్థితిలో పడివుంటాయి. తమ పరిస్థితులనుబట్టి కమ్యూనిస్టులు ఎప్పుడో ఈ భాగాలను కబళించివేస్తారు. ఈలోగా కమ్యూనిస్టులు ఉత్తరచైనాలో బాగా బలపడుతూవుంటారు. ఇలాగ చేయడం వల్ల ఎవరైనా వారిపై దండయాత్ర చేస్తే వారు సులభంగా ఆత్మరక్షణచేసుకోగలుగుతారు.

తూర్పు యుద్ధరంగంలో భద్రత చేకూరింది కనుక; కమ్యూనిస్టు లింక పశ్చిమంగా తమ దృష్టి కేంద్రీకరించాలని చూస్తున్నారు. ఆసియాలో కమ్యూనిస్టు లెంత బ్రహ్మాండమైన విజయాలు సాధించినా, ముంచుకు వస్తూన్న తృతీయప్రపంచ మహాయుద్ధం ఐరోపాలోనే జరగవలసి ఉన్నది. బోన్ ప్రధాననగరంగా తూర్పు జర్మనీ ఫెడరల్ రిపబ్లిక్ స్థాపించడంవల్ల ఈ సమస్య మరింతగా తీవ్రమైనది. జర్మనీపై ఎవరు అధికారం చెలాయిస్తే, వారే చివరికి ఐరోపాకు అధినాయకు లవుతారు. జర్మనీ ఆధిపత్యం విషయంలో ఇకరాజీకి అవకాశా లేని లేవు. రష్యావారికి పరిస్థితులు అన్నివిధాలా తమకు అనుకూలంగా ఉన్నాయని తెలుసును. అందుచేత ప్రతిపక్షులు ముందు చొచ్చుకు పోవడానికి వారెంతమాత్రము అంగీకరించరు. బెర్లినులో జర్మను ప్రభుత్వం జర్మనీకంతటికీ ప్రతినిధి కాకుండా పోతుందేమో నన్న భయంచేత, వారు మొట్టమొదటగా తూర్పు జర్మనీ ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి సందేహించారు. చివరిదాకా బోన్‌లో జర్మనీ కంతటికీ కేంద్రప్రభుత్వం ఏర్పడనీయకుండా చెయ్యడమే రష్యావారి ఉద్దేశ్యము. రష్యావారు క్రిస్టియన్ డెమోక్రటిక్ పార్టీకి చెందిన కొంతమందికిని కూడా తమపక్షానికి తిప్పుకోవడం జరిగింది. కాని అమెరికావారు ఈ ఎత్తు సాగకుండా అడ్డు తగిలారు. అమెరికావారు పెద్దపెద్ద పారిశ్రామికులైన క్రిస్టియను డెమోక్రటిక్ పక్షంవారి వరతులన్నిటికీ అంగీకరించారు. అందుచేతనే అమెరికా వారు వీరు రష్యావారి వలలోపడకుండా కాపాడుకోగలిగారు.

పాశ్చాత్యరాజ్యాలు ఈ విషయం ముందుగానే ఊహించుకోగలిగారు. కాని వీరు రష్యా ఎత్తిన మరి ఒకయెత్తుచూచి ఎంతో నిర్ఘాంతపోయారు.

తూర్పు జర్మనీలో ఏర్పడిన బోన్ రాజ్యంలో బెర్లిన్ చేర్చబడలేదు. కాని బోన్‌ప్రభుత్వం ఏర్పడగానే, ఆ ప్రభుత్వం బెర్లిన్ నగరాన్ని ఆక్రమించిన ప్రభుత్వాలన్నీ ఆ నగరాన్ని విడిచిపెట్టి పోవాలని అన్నది. ఈమాట అనగానే రష్యా బెర్లిన్ ఖాళీచెయ్యడం మొదలు పెట్టింది. దీనికి పర్యవలా నిర్ఘాంత పోయారు. 10 రోజులలో బెర్లినులో ఉన్న ఆఖరి రష్యాయోధుడుకూడా ఈ నగరం విడిచి పోగలడని తెలుస్తున్నది. ఇది కేవలం నట్టి దబాయింపని అనడానికి వీలులేదు. రష్యావారు చూపించిన ఆదర్శం, పాశ్చాత్య రాజ్యాలు అనుసరించలేక పోయాయి. దీనివల్ల జర్మనీలో అంతటా పాశ్చాత్య రాజ్యాలమీద ఏవగింపు బయలుదేరుతుంది. పాశ్చాత్య రాజ్యాలు రాజకీయ కారణాలవల్ల బెర్లిన్ నగరం విడిచి వెళ్ళలేదు. ఇవి రష్యా ఎత్తిన ఎత్తు అర్థం చేసుకోగలవు. కాని జర్మనీ ప్రజలకు రష్యాఅంటే గౌరవము. పాశ్చాత్యరాజ్యాలంటే అగౌరవం కలిగితీరతాయి.

రష్యావారు నిజంగా బెర్లిన్ నగరం పాశ్చాత్యరాజ్యాలకు విడిచివెళ్లిపోతున్నారనీ, బోన్ ప్రభుత్వం ఇంక బెర్లిన్‌లో ప్రవేశించడమే తరవాయి అనీ భావించేవారు చాలా అమాయికులు. ఈవిషయంలో స్టాలిన్ ఏదో పెద్దఎత్తు ఎత్తబోతున్నాడనీ చివరికిదాకా ఆయెత్తు ఎవరికీ తెలియనివ్వడనీ నా విశ్వాసము. స్టాలిన్ ఆయెత్తు ఎత్తేసరికి అది చిలికి చిలికి గాలివాన కావచ్చును. అయితే రష్యావారు ఇలాంటి పరిస్థితి రాకుండా జాగ్రత్తగా కాచుకుంటూ వస్తున్నారు. ఇందుకోసం వారు బెర్లిన్ దిగ్బంధం తీసివేసే వరకుకూడా ఆగ్నారు. అయితే రష్యావారిప్పుడు ఒక ఎత్తు ఎత్తబోతున్నారని అనుకున్నాము. వారిల్లా నిశ్చయించు కోవడానికి ఒక కారణం ఉన్నది. చైనా విజయం ఈ నిశ్చయానికి కారణంకాదు. ఆసియా విజయం చాలావరకు ఇంకా ఊహాగానంలోనే ఉన్నది. పశ్చిమంగా చొచ్చుకు వెళ్ళినంతమాత్రాన్ని యుద్ధం రాదని రష్యావారికి తెలుసును. వారిదగ్గరకూడా ఆటంబాంబు ఉన్నదని హఠాత్తుగా ప్రకటించారు. ఇదికూడా యుద్ధం రాకుండా ఆపివేస్తుంది.

ఇదిఏదో పరస్పర విరుద్ధంగా కనబడవచ్చును. కాని ఇందులో విరుద్ధంఏమీ లేదు. చివరికి ఫలితం ఏమి జరిగినా, కావాలంటే రష్యావారు ముందుకుచొచ్చుకొనిపోయి అట్లాంటిక్‌తీరం చేరగలవారు. వారిని ఎవ్వరూ ఆపలేరు. కాని అది చిరకాలంసాగే యుద్ధానికి నాంది ప్రారంభమేకాగలదు. జర్మనీ తమపైకి ఎత్తివచ్చినప్పుడు వారికి మొట్టమొదట త్వరత్వరగా వచ్చిన విజయాలవల్ల ప్రయోజనం ఏమీలేదని తెలిసింది. అదికాకుండా ఉండడానికి మరిఒక కారణంకూడా ఉన్నది. పాశ్చాత్యదేశాలు, ఇంగ్లండు, రష్యాతో యుద్ధం రాకుండా ఉండడానికి తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాయి. యుద్ధం వచ్చేటంతే ఈ పాటికి రష్యా పాశ్చాత్య రాజ్యాలనన్నిటినీ ఆక్రమించివేసివుండును అయితే ఆ తరవాత అమెరికా ఆక్రమాలను విముక్తి కలిగిస్తే కలిగించవచ్చును. ఈ రెండు యుద్ధాలవల్ల ఫ్రాన్సు, హాలెండు, కేవలంధైర్యంగా నిలబడి ఎదుర్కోవడం వల్ల ప్రయోజనమేమీలేదని గ్రహించాయి. బెర్లిన్ దిగ్బంధంవిషయంలో యుద్ధం వచ్చియుండవలసిందే కాని ఇంగ్లండు ఫ్రాన్సులు అమెరికా సైన్యాధిపతిని కొంచెం తగ్గవలసిందని హెచ్చరించడంవల్ల ఆ ఉపద్రవం తప్పిపోయింది.

ఇప్పుడు రష్యావారికి ఆ ఏటంబాంబు ఉన్నదని తెలియడంవల్ల ఇంగ్లండు ఫ్రాన్సులు మరింతజాగ్రత్తపడతాయి. ఇవి జర్మనీ అంతాపోయినాసరే యుద్ధంలోకి దిగకూడదనే పరిస్థితిలోకి వస్తాయి. రష్యావారికి ఆటంబాంబు ఉన్నదన్నవార్త ప్రకటించగానే నోబెల్ బహుమానం పొందిన అమెరికా శాస్త్రజ్ఞుడు డాక్టరు హెరాల్డ్ యురే ఇలాగ అన్నారు. "ఇప్పుడు యుద్ధం రాకుండా వున్నదంటే అది రష్యాదయాధర్మభిక్షమే. నిజంగా యుద్ధమేవస్తే మనం పాశ్చాత్య రాజ్యాలను దురాక్రమణనుండి సంరక్షించలేము." డాక్టరు యురే ప్రఖ్యాతశాస్త్రజ్ఞులు. ఈయన 'హెవీ వాటర్' అనే వస్తువును కనిపెట్టి అణుశక్తి సముత్పాదనకు తోడ్పడ్డారు. ఒక్క తుపాకీగుండైనా పేల్చనక్కరలేకుండా జర్మనీని చేజిక్కించుకునే అవకాశం వచ్చిందని రష్యావారు ఊహించి చాలా తెలివైన ఎత్తువేశారు. ఇందులో వారన్నిటికీ సిద్ధమయ్యేవున్నారనికూడా నా అభిప్రాయము. యుద్ధం వచ్చినా వాళ్లు దానికి పూర్తిగా తయారుగా వున్నారు. యుద్ధంరావస్తే, చైనా కమ్యూనిస్టులు చైనా యుద్ధంచేసినట్లుగానే జర్మనీ కమ్యూనిస్టులు జర్మనీ యుద్ధంచేస్తారు. అదే స్టాలిను ఎత్తిన ఎత్తు.

సామాన్యంగా ప్రపంచంలో పత్రికలు చదివేవారందరు, రష్యాలో నిర్బంధించబడిన "స్వతంత్ర జర్మనీ సంఘసభ్యులను"గూర్చి పూర్తిగా మరచిపోయే వుంటారు, స్టాలిన్‌గ్రాడ్‌లో ఫీల్డ్‌మార్షల్ పాలస్ తన సైన్యాలన్నిటితోను ఖైదీ అయ్యాడు.

రష్యాలో ఇంకా 20 లక్షల జర్మనీ సైనికుల లెక్కలు తేలడంలేదన్నవిషయం అందరికీ తెలిసిందే. వారందరిచేత బలవంతంగా పనిచేయించి రష్యావారు యుద్ధనష్టపరిహారం రాబట్టుకుంటున్నారని నా ఊహ. వారందరికీ కమ్యూనిస్టు సిద్ధాంతాలు బాగా బోధపరచడంకూడా జరిగివుండవచ్చును. అసలు విషయం చెప్పవలసివస్తే-రష్యాలో ఎక్కడో పాలస్ సైన్యాధిపతిక్రింద ఒక బ్రహ్మాండమైన జర్మనీసైన్యం తయారవుతున్నదన్నమాట. ఇంకా కొంతమంది జర్మనీసైన్యాధికారులుకూడా ఈ సైన్య నిర్మాణానికి సహాయపడుతూ వుండవచ్చును.

ఈ సైన్యం ఇనపతెర వనకాల ఎక్కడనో వుండి వుండవచ్చునని నా అభిప్రాయము. ఈ మధ్యన తెలిసిన వార్తల వల్ల ఇది పోలండులో ఎక్కడనో వున్నదని తెలుస్తున్నది. ఈ సైన్యం విల్హెల్మ్ పెక్ ఆజ్ఞాపించేసరికి జర్మనీమీదికి వచ్చిపడుతుంది. ఇలా చెయ్యడం చాలా తెలివైనపని. దీనివల్ల బెర్లినులోవున్న పాశ్చాత్యదేశాలు బాగా ఇరుకులో పడిపోతాయి.

బోన్ ప్రభుత్వంలాగే తూర్పు జర్మనీ ప్రభుత్వంకూడా చట్టప్రకారం ఏర్పడింది. అందుచేత ఈ తూర్పు జర్మనీ ప్రభుత్వం పశ్చిమ జర్మనీ ప్రభుత్వాన్ని తరిమివేయడానికి తగిన అధికారం కలిగి ఉంటుంది. దీనివల్ల జర్మనీవారే స్వదేశ స్వాతంత్ర్యంకోసం పోరాడినట్లవుతుంది. రష్యావారికి ఈ తగాదాలో ప్రమేయమే ఉండదు. కాని స్టాలిన్ క్రెమ్లినుభవనంలో ఆయా దేశ పటాలు ఎదర ఉంచుకుని ఈ తమాషా అంతా తిలకిస్తూ కులాసాగా నవ్వుకుంటూ కూర్చోవచ్చును.

దీనిమూలాన్ని అంతగ్గా తీయంగా ఎలాంటి పరిణామాలు ఏర్పడినా పనమటి జర్మనీలో రాజకీయంగా కొన్ని మార్పులు వస్తాయి. పాశ్చాత్యరాజ్యాలు అధికారంలో ఉంచిన పశ్చిమజర్మనీ పాలకులు స్వతస్సిద్ధంగా అభివృద్ధి నిరోధకులయినా రష్యా అభిషేకించిన కమ్యూనిస్టు జర్మనీతో చేతులుకలపడానికి వీరికి అభ్యంతరం ఏమీ ఉండదు; అసలు రష్యాయే పూర్వం నాజీలుగా ఉన్నవారినందరినీ క్షమించి విడిచివేసింది. అందుచేత కమ్యూనిస్టు జర్మనీతో వీరు చేతులుకలపడం అంత కష్టంగాదు. జర్మనీ సేన వచ్చి మిగిలిన జర్మనీ భూభాగానికి విముక్తి కలిగిస్తూంటే ఇక పాశ్చాత్యరాజ్యాలు ఏ మొహంతో జర్మనీసేనతో పోట్లాడగలవు? అందుచేత ఒకవేళ చేదామనుకున్నా వారే ప్రయోజనరహితమైనపని తలపెట్టరు. ఇంక జర్మనీతో యుద్ధం చేయాలనుకుంటే వారు తృతీయ ప్రపంచ యుద్ధానికి సంసిద్ధులు కావాలి. తృతీయ ప్రపంచయుద్ధం ప్రారంభించేసరికే రష్యావారికి మధ్య యూరపులో సంపూర్ణాధికారం ఉంటుంది. అయితే దూరదృష్టితో ఆలోచిస్తే, నిజానికి అది అంతంత ఎక్కువగా ఉపయోగకారికాదు. అందుచేతనే రష్యావారు హఠాత్తుగా తమకు ఏటంబాంబు ఉన్నసంగతి వెల్లడించి, ఇంగ్లండు ఫ్రాన్సులను ఎలాగైనా రాజీ చేసుకునే పరిస్థితులలో పెట్టింది. ఇంక దూరంగాఉండిన అమెరికావారు ఎల్లాగా యుద్ధంలోనికి దిగేదిలేదు. అందుచేత రష్యావారు జర్మనీ యుద్ధానికో బహుశః ఐరోపా యుద్ధానికో యెత్తు ఎత్తినట్లు కనిపిస్తుంది. దీనివల్ల పెద్దయుద్ధం రాదనే దృష్టితోనే రష్యా వారిందుకు పూనుకుంటున్నారు. అయితే అవసరమైతే జేనికైనా సిద్ధపడడానికే రష్యావారే యుద్ధంలోకి దిగుతున్నట్లు కనిపిస్తుంది.

దీనినిబట్టి ఈమధ్యన తూర్పు యూరపులో చాలామంది ఉద్యోగస్థులను తొలగించడానికీ, జైలులో వెయ్యడానికి గల కారణాలను గ్రహించవచ్చును. యూరపులో యుద్ధంవచ్చినసందర్భంలో సైన్యాలకు ప్రాగ్భాగం బాగా సురక్షితంగా ఉండాలి. గత యుద్ధం ప్రారంభంతో కూడా రష్యాలో ఇలాంటి శిక్షణచర్యలే జరిగాయి. నియంతృత్వానికి ఏవిధమైన ఆపత్తురాకుండా ఉండడానికే ఈ చర్యలన్నీ తీసుకుంటున్నారు. పూర్వంకూడా ఇలాంటి దృక్పథంతోనే ఈ రక్షణచర్యలు తీసుకోవడం జరిగింది.

కమ్యూనిస్టు జర్మనీ జాతీయ జర్మనీ సైనికనియంతలతో చేతులు కలపడంవల్ల కమ్యూనిస్టువర్గాలలో బాగా అశాంతి ఏర్పడవచ్చును. అందుచేత కమ్యూనిస్టు వర్గాలలో ఎవరైనా కొంచెం వ్యతిరేకత కనబరిస్తే వారినందరినీ పూర్తిగా ఏరివెయ్యాలి. టిటో తిరుగుబాటువల్ల బాల్కను రాజ్యాలలోను, తూర్పు యూరపు రాజ్యాలలోను ఎదురుతిరగడానికి కొంచెం ప్రోత్సాహం కలిగింది. అందుచేత రాబోయే యుద్ధానికి ముందుగా కమ్యూనిస్టు వర్గాలన్నిటినీ ఒక్క తాటిమీద నడిపించాలి. అయితే పూర్వంనించీ కమ్యూనిస్టు రక్షణకు అవలంబించిన పద్ధతులిప్పుడు పనికి రాక పోవచ్చును. సైనికచర్యతీసుకోవడం తప్పకపోవచ్చును. ఇంతవరకు రష్యా తమకు వ్యతిరేకించే వారిమీద సైనికచర్య తీసుకోవడానికి సంకోచించింది. రష్యా తన కింద దేశాలనన్నింటినీ అణచివేస్తూన్న అపనిందాభయమే దీనికి కారణము. రష్యా రక్షణదృష్టితో చూస్తే యుగోస్లావియాను సైనికంగా ఆక్రమించడము, కమ్యూనిస్టు వర్గాలలో వ్యతిరేకత లేకుండా చెయ్యడము, సమాన ప్రాముఖ్యం కలిగినవే. ఏడ్రియాటిక్ సముద్ర తీరంపై ఆధిపత్యం వచ్చింది కాబట్టి రష్యా ఇటలీని ఏటంబాంబులతో భయపెట్టి, తూర్పుమధ్యధరా సముద్రంపై ఆధిపత్యం సంపాదించవచ్చును. సమీప ప్రాచ్యాన్ని ఒంటరిగా చేసివెయ్యవచ్చును.

రష్యావారు ఐరోపాచతురంగ క్షేత్రం మీద ఈ ఎత్తులు ఎప్పుడు వేసినా వెయ్యగలరు. ఆసియాలో వారికి బాగా లాభించింది. ఐరోపాలో అన్ని విషయాలలోను వారిదే పైచేయిగా ఉంటున్నది. రష్యా ముందుగా టిటోను పరిష్కరించి వేస్తుందని నావిశ్వాసం. ఇలాగ చేస్తే పశ్చిమ యూరపు యుద్ధంలో పశ్చిమ దక్షిణ దిక్కులలో అపాయం ఏమీ లేకుండా కాచుకోవచ్చును. అయితే బెర్లిన్‌లో సమీపభవిష్యత్తులో ఏమి జరుగుతుందో చెప్పలేము. దీనిమీదనే యూరోపు భవిష్యత్తంతా ఆధారపడి ఉన్నది. రష్యా బెర్లినను పాశ్చాత్యదేశాలకు బహుమతి చెయ్యదలచుకోలేదు. అందుచేత వారు బెర్లిను ఖాళీచెయ్యడంవల్ల త్వరలోనే ఏదో ఒక మహాద్భుతం జరగవచ్చునని ఊహించవచ్చును. స్టాలిను తాను తలపెట్టిన ఎత్తు బయటపెట్టే తరుణం ఆసన్నమైంది.

SERVICE
INDIA

ప్రభుత్వ వినియోగానికి జారీ అయిన భారతదేశపు క్రొత్త పోస్టు స్టాంపులు

# పోస్టు చేయని ఉత్తరాలు

గోపీచంద్

## 5

నేను అరవిందుని అభిప్రాయాలను కొన్నిటిని సమర్థించటం, నా అభిప్రాయాలను బలపరచుకోటానికి కొన్నిటిని ఉదహరించటం నీకు ఆశ్చర్యం కలిగించిందని వ్రాశావు. నిజమే! అరవిందుని అభిప్రాయాలు కొన్ని నన్ను కదిలించటం మొదలుపెట్టినప్పుడు నన్ను నేను చూసి నేనే ఆశ్చర్యపడ్డానంటే ఇక నీ సంగతి చెప్ప నవసరంలేదు.

కాని ఆలోచించిచూస్తే ఇందులో ఆశ్చర్యపడవలసింది ఏమీలేదు. ఒక రచయిత దృష్టిని మనం అంగీకరించనంత మాత్రాన, అతను చెప్పేవి వేటినీ మనం అంగీకరించకూడదు అనుకోవటం పొరపాటు. హెగెల్ ఆధ్యాత్మిక వాదంలో నుంచి మార్క్సు కొన్ని అంశాలను తీసుకొని తనసిద్ధాంతం నిర్మించాడనే విషయం నీవు అంగీకరించే విషయమే. పాతసిద్ధాంతాలనుంచేకొత్తసిద్ధాంతం పుట్టుకొస్తుంది. వ్యతిరేకసిద్ధాంతాలు నొకదానిలో నొకటి చొచ్చుకు పోవటంవల్లనే నూతన సిద్ధాంతం నిర్మించబడుతూ వుంది, అని మనం అంగీకరించినప్పుడు, ఎప్పటికప్పుడు వ్యతిరేక సిద్ధాంతంలో కొంత మంచి వుంటూ వుంటుందనీ, అది మనసిద్ధాంతంలో కలుపుకోవాలనే గమనం తప్పని సరి అవటంలేదా? మరిఎందుకు నీవు అలా ఉలిక్కిపడతావు. ఎందుకు రజ్జుసర్ప భ్రాంతికి లోనవుతావు?

దీనికి కారణం నాకు వొకటే కనపడుతుంది. మనం, ఎవరికి వాళ్లం, ఎవరి చుట్టూ వాళ్లు, గోడలు కట్టుకున్నాం. ఎవరికివాళ్ళకి వాళ్ళ నాలుగు గోడలమధ్యదే ప్రపంచం. అవతలవాళ్లు ఇవతలకిగానీ, ఇవతలివాళ్లు అవతలికిగానీ తొంగిచూట్టమే తప్పు. ఎవరికి వాళ్లు తాము స్వర్గంలో వుంటున్నామనీ, మిగిలినవాళ్లు నరకంలో మ్రగ్గుతున్నారనీ అనుకోవాలి. అలా అనుకోవటం విప్లవపంథా. అనుకోకపోవటం ఛాందసం. మనం గోడలనీడలుగా బ్రతుకుతున్నాం. అప్పుడప్పుడూ ఈ గోడలను అధిగమించి చూడాలనే ఆవేశం కలిగినా అది బుద్బుదప్రాయం. మరుక్షణం వేసిన చోటే వుంటున్నాం. బుద్ధిబలంవల్ల మనం వొకసిద్ధాంతాన్ని అర్థం చేసుకున్నా మన తత్వం మాత్రం దానిస్థాయిని అందుకోలేక మామూలు స్థితిలోనే వుంటూ వుందని దీనివల్ల ఋజువు అవుతూ వుంది.

వ్యతిరేక సిద్ధాంతాల సమన్వయం నూతన సిద్ధాంతానికి దారితీస్తుందని మనం వొప్పుకుంటున్నాం, మాటల్లో. కాని క్రియలో వ్యతిరేకసిద్ధాంతంలో కొంత మంచివుందని చూపితే కస్సుమంటున్నాం. బాధపడుతున్నాం. మనసిద్ధాంతాన్ని మనమే వ్యతిరేకిస్తున్నాం. ఎందుకు వొచ్చిన వెర్రి ఇది?

నేను నీకు మళ్లే పాతదంతా సంపూర్ణ అసత్యం కొత్తది అంతా సంపూర్ణ సత్యం అని అనుకోలేకుండా వున్నాను. కొత్తది అనేది పాతదాంట్లోనుంచే పుట్టుకొచ్చింది గాని ఎక్కడనుంచో ఎగిరివొచ్చి మన మధ్య వాలలేదు. ఏ సిద్ధాంతం విలువైనా దాని మంచిచెడులను బట్టివుండాలి గాని పాతాకొత్తను బట్టి కాదు. చెప్పే వ్యక్తులమీద మనకున్న గౌరవా అగౌరవాలనుబట్టి కాదు.

కాబట్టి నేను అరవిందుని ఉదహరించబట్టీ, అతని అభిప్రాయాలను కొన్నిటిని అంగీకరించబట్టి నీవు ఉలిక్కిపడవలసిన అవుసరంలేదు. నేను వెలిబుచ్చిన అభిప్రాయాల్లో తప్పువుంటే చెప్పు. అది నీకూ లాభం. నాకూ లాభం. నేనేదో అరవిందుని శిష్యుణ్ణే అయ్యానని చెప్పి, మామూలుగా అరవిందునిమీదవున్న దుర్భ్రమలను వాడుకొని, నేను చెపుతున్నదానికి విలువలేకుండా చెయ్యటానికి ప్రయత్నించకు. నీవు ఈ టెక్నిక్ ఎందుకు వుపయోగిస్తున్నావో నాకు బోధపడటంలేదు. నీవు అయినా, నేను అయినా సత్యం తెలుసుకోవాలనిగదా అపేక్షపడవలసింది. అటువంటప్పుడు, ఏదో వొక ట్రిక్కు చేసి నీవు చెప్పేదే రైటు అని అనిపించుకోవాలనే తాపత్రయం నీకు ఎందుకో నాకు బోధపడటంలేదు. ఒక భావం మన సొంత సొమ్ము గనక నా రెండోది కాకపోయింది గనకనా?

ఏ సిద్ధాంతానికిమట్టుకు ఆ సిద్ధాంతంలోనే దాన్ని వ్యతిరేకించి రూపం మార్చే బీజాలు వుంటూనే వుంటాయని విజ్ఞులు చెప్పుతున్నారు. దీన్నిబట్టి మనం ఒక సిద్ధాంతాన్ని ప్రచారంచెయ్యటమే వ్యతిరేకశక్తుల్ని లేపి పురికొల్పటం అవుతూ వుంది. మానవ పురోగమనానికి ఇది అవుసరం: అనివార్యం. ఈ వ్యతిరేకశక్తులు లేగటం అనేది, ఇతరులలోనే కాదు, ఆ సిద్ధాంతాన్ని ప్రచారంచేసే మనలోకూడా జరుగుతూవుంటుంది. మనం ఒకసిద్ధాంతాన్ని నమ్మి ప్రచారం చేస్తుంటాం. ఆ సిద్ధాంతంలో బీజరూపంలో వున్న వ్యతిరేకత క్రమక్రమేణా మనలోనే వృద్ధి చెందుతుంది. ఇదివొక రూపం పొందినప్పుడు మనంనమ్మిన సిద్ధాంతంతో ఘర్షణకు దిగి, సమన్వయపడి, మనని పైఅంతస్తుకి తీసుకువెళ్తుంది. కాబట్టి మనం ఎప్పటికప్పుడు, ఒకసిద్ధాంతాన్ని నమ్మిప్రచారంచేస్తూ, వెంటనే దాన్ని విమర్శించుకొని చూసుకుంటూవుండాలి. మనం నమ్మిన సిద్ధాంతానికి విరుద్ధమైన భావాలు మనకు కలుగుతుంటై. అదిసిద్ధాంతం స్వభావం అని తెలుసుకొని, విమర్శించి చూసుకోవాలి గాని, అదేదో మన తప్పు అనుకొని, వాటిని భయంకరంగా అణగద్రొక్కుకోటానికి ప్రయత్నించి ఆత్మద్వేషులం కాకూడదు. Consistency పేరుతో మనం ఈ పనికి పూనుకుంటే సహజ పరిణామం వక్రరూపం ధరించి మనహృదయాలు నరక కూపాలౌతై. మనం ఒకవిషయం నమ్మాలి. నమ్మకుండా వుండాలి. ప్రపంచం పరిణామంచెందే విధానాన్నిబట్టి, నమ్మకం ఎప్పుడూ అపనమ్మకానికి దారితీస్తుందనే విషయం మనం ఏనాడూ ఏమరకూడని అమరసత్యం. నమ్మకంలోనే అపనమ్మకం వుంది. అపనమ్మకంలోనే నమ్మకం వుంది. ప్రపంచంలో విరుద్ధశక్తుల సమన్వయ ప్రదేశం మానవుడేననీ, మానవుడు ప్రకృతిపురుషుడూ, రెండూననీ, నేను విరుద్ధశక్తుల 'సమన్వయం' అన్నప్పుడు రెండుముక్కలు కలవటం కాక ఈ కలయికవల్ల స్వభావమే మారుతుందని నా అభిప్రాయమనీ నేను నీకు వేరుగా వ్రాయనక్కరలేదు అనుకుంటాను. ఆధ్యాత్మిక వాదాన్నుంచిగానీ మన పూర్వ గ్రంథాలనుంచిగానీ, మనం నేర్చుకోవలసింది ఏమీలేదని అనుకోవటంగానీ, ఉన్నది అంతా 'రియాక్షనరీ' యే అనుకోవటంగానీ కేవలం పొరపాటు. తర్కతీర్థ లక్ష్మణశాస్త్రిజోషీ మన వేదాంతశాస్త్ర చరిత్రను విపులీకరిస్తూ ఈ విధంగా వ్రాశారు. "హైందవ వేదాంతం నిజంగా అపారమైంది. అందులో మనకు పనికివొచ్చే సూత్రాలనూ, మనలను ఉత్తేజపరిచే భావాలనూ కనిపెట్టటానికి వీలు వుంది. మన తత్వాన్నిగురించీ తర్కాన్నిగురించి నీతిశాస్త్రాన్నిగురించీ అనేకవిషయాలు తెలుసుకోవొచ్చు." అన్నాడు. మన తత్వశాస్త్ర చరిత్రను పరిశీలిస్తే ఆధ్యాత్మిక వాదాన్నుంచి భౌతికవాదులు ఎంత నేర్చుకోవలసింది ఎంతవుందో, భౌతికవాదాన్నుంచి ఆధ్యాత్మిక వాదులు ఎంత నేర్చుకోవలసివుంటుందో తేటగా తెలుస్తుంది. పైకి ఎంత విరుద్ధంగా కనపించినా ఈరెండు సిద్ధాంతాలు వొకదానివల్ల వొకటి ఎంతమారిందీకూడా స్పష్టపడింది. ఈరెండూ కలుసుకునే స్థలం కూడా కనుచూపు మేరలో ఉన్నట్టు కనిపిస్తుంది.

భౌతికవాదులూ, ఆధ్యాత్మిక వాదంలో కొందరూ, ఈప్రపంచం ఒకే వొస్తువునుంచి పరిణామం చెందింది అని వొప్పుకుంటారు. అయితే భౌతికవాదులు పదార్థం అనాది అంటారు. ఆధాత్మిక వాదులు సర్వం ఆత్మే అంటారు. ఉపనిషత్తులు ఈరెండు సిద్ధాంతాల మధ్యానిలబడి, ఈ రెండు సిద్ధాంతాలను గురించీ అనేక విషయాలు చర్చించాయి. సాంఖ్యయోగం, ఉపనిషత్తుల సహాయంతో పదార్థమే నిజమని నిర్ధారణచెయ్యటానికి ప్రయత్నించింది. సాంఖ్యులు ఉపనిషత్తులలో నిర్దేశించబడిన బ్రహ్మం ప్రకృతే అన్నారు. దీనికి అనుకూలమైన సాక్ష్యం మహాభారతంలోని శాంతిపర్వంలోనూ, చరకసంహితలోనూ కనిపిస్తుంది. మొదటిదశకు చెందిన సాంఖ్యులు పదార్థమే సత్యమనీ, అందులోనుంచి 23 సూత్రాలు ఉత్పన్నం చాయనీ చెప్తారు, ఇక వలి సాంఖ్యులు ప్రకృతీ పురుషుడూ వొకే వస్తువుయొక్క రెండు గుణాలు అని చెపుతున్నారు. సాంఖ్యయోగం వేదాలలోనూ, ఉపనిషత్తులలోనూ ఉన్న రెండు ముఖ్య సూత్రాలనుంచి, వృద్ధిచెందింది. ఇందులో మొదటిది ఈప్రపంచానికి పదార్థమే మూలకారణం అనేది. రెండోది కార్యకారణ సంబంధం. కారణమూ, కార్యమూ వొకటే. కారణమే కార్యరూపం ధరిస్తూవుంది. కార్యం బహిర్గతం కాకముందు కారణంలో అంతర్లీనమైవుంది ఏదీ కొత్తగా పుట్టదు. అంతకుముందు అంతర్లీనంగా ఉన్నది బయటకు వొస్తుంది. దేనికీ నాశనం అనేదిలేదు. మనం నాశనం అయింది అనుకున్నది మళ్ళీ కారణంలో అంతర్లీనం అవుతుంది. అయితే... ఈ విధంగా, సాంఖ్యులు వాదిస్తారు.

ఉపనిషత్తుల్లో నుంచి పుట్టిన ఈ వేదాంతానికి నెమ్మది నెమ్మదిగా అనేక వ్యతిరేక సిద్ధాంతాలు బయలుదేరినై. వీటిలో ముఖ్యమైంది బౌద్ధం. బౌద్ధం, ఉపనిషత్తులకు పూర్తిగా వ్యతిరేక సిద్ధాంతం. బుద్ధుడు తన సిద్ధాంతాన్ని 'ఆత్మ' వాదానికి విరుద్ధంగా సృష్టించాడని మనం అనేక ఉదాహరణలతో నిరూపించవచ్చు. పైకి కనపడే ఈమార్పుల వెనుక మారని ఆత్మ వొకటి వుందని ఉపనిషత్తుల ఉపదేశం. బౌద్ధం ఈ వాదం అంగీకరించదు. ప్రతి వస్తువూ, ప్రతిదీ ఎల్లప్పుడూ మారుతూ వుంటుందనీ, ఎల్లప్పుడూమారే అణువుల తోకూడివుంటుందనీ, కార్యమూ కారణమూ వేరనీ, కార్యము కారణాన్ని నాశనంచేసి పుట్టుకొస్తుందనీ ఈ కార్యం, రాబోయే కార్యానికి కారణం అవుతుందనీ బౌద్ధం చెపుతుంది. బౌద్ధం పునర్జన్మని వొప్పుకుంటుంది. చార్వాకుడు ఇదీ అంగీకరించడు, మానవపురోభివృద్ధికి మతం అవుసరంలేదని అతని వాదం. జ్ఞానం సహాయంతో సాంఘికవ్యవస్థలు జయప్రదంగా నడుస్తవని అతని నమ్మకం. కాని మన జ్ఞానం ఎంతవరకుసత్యమో తరచిచూడాలని అతను చెబుతాడు. వైశేషిక ధర్మం అటు ఉపనిషత్తులనూ, ఇటు బౌద్ధాన్నీ కూడా విమర్శిస్తుంది. అస్తిత్వం ఉపనిషత్తులు చెప్పినట్టు స్థిరమూకాదు బౌద్ధులు చెప్పినట్లు తాత్కాలికమూకాదు అంటారు వైశేషికులు. అస్తిత్వం స్థిరమైనదీ తాత్కాలికమైనదీ, మారనిదీ మారేదీ అంటారు. మొదట అణు సిద్ధాంతాన్ని నిర్మించిన గౌరవం వైశేషికులకు చెందవలసిందే. అస్తిత్వానికి కారణం స్థిరంగావుండే అనేకమైన అణువులని వీరు చెపుతారు. వీటి సంయోగంవల్ల ప్రపంచం ఉద్భవించింది. ప్రపంచంలో కనపడే భేదాలు పైకివున్న భేదాలు మాత్రమేకాదు. వస్తుతః అస్తిత్వంలోవున్న గుణాలవల్లవచ్చిన భేదాలు; అంటారు వైశేషికులు. మన వేదాంత శాస్త్రంలోని ముఖ్యవిషయాలివి. మన తత్వజ్ఞులు ప్రపంచాన్నిగురించీ దాని స్వభావాన్నిగురించీ తెలుసుకోవాలనీ, తెలియపరచాలనీ చాలాకృషిచేశారు. మన వేదాంత శాస్త్రాన్నిగురించి మనం సిగ్గుపడవలసిన అవుసరంలేదు. దాన్నిగురించి తెలుసుకోవలసిన అవుసరంగానీ, తెలుసుకుని నేర్చుకోవలసిన అవుసరంగానీ ఏమీ లేదనుకోవటం, మంచిగుణంకాదు. తర్కతీర్థ లక్ష్మణశాస్త్రిజోషీ మన తత్వశాస్త్రం ప్రత్యేకతనుగురించి చెపుతూ, "భావస్వాతంత్ర్యం, దానివల్ల పెరిగిన సంస్కారం, మనపూర్వులసొత్తుగా కనిపిస్తుంది. బ్రహ్మసూత్రాలకుముందు సాంఖ్యశాస్త్రం పుట్టటానికి గౌతమునికిముందు, భౌతిక తర్కం పుట్టటానికి ఇదేకారణం. కుమారిలభట్టు పూర్వ మీమాంస వర్తికలో వేదమతాన్ని అనుసరించేవారిలో భౌతిక పూర్వపు మీమాంస తలఎత్తుతూవుందని ఎత్తిచూపించాడు," అని వ్రాశాడు. ఈ భౌతికవాదాలు చాలాకాలంక్రిందటే నశించిపోయినై అనే మాట నిజమే! కాని పూర్వులనుభవించిన భావస్వాతంత్ర్య లక్షణాలు మన వేదాంత శాస్త్రంలో సాంఖ్యం, పూర్వమీమాంస, వైశేషిక ధర్మం, జైనం బౌద్ధం మొదలైన నాస్తిక రూపాల్లో, ఇంకా కనపడుతూనే వున్నాయి.

వేదాంత శాస్త్రం స్వయం శక్తివల్లనూ, తర్క సహాయంతోనూ, ప్రపంచంలోని అస్తిత్వాన్ని వ్యాఖ్యానించి, ప్రపంచాన్ని మార్చటానికి సహాయపడే శాస్త్రం. ఇది భౌతిక వాదాన్నీ, ఆధ్యాత్మిక వాదాన్నీ అజలోకి తీసుకుంటుంది. అన్నిటికీ పునాది వొకటే అని చెప్పే భౌతిక వాదం, ఈ భౌతిక ప్రపంచంలో మానవునికి ఎటువంటి స్థానం వుందో తెలియపరుస్తుంది. అదే విధంగా ఆధ్యాత్మిక వాదం మానవుని ఆత్మయొక్క స్వభావాన్నీ ఈ ప్రపంచానికీ దానికీ వున్న సంబంధాన్నీ తెలియపరుస్తుంది.

ఈ రెంటినీ సమన్వయ పరచలేని సిద్ధాంతం తన ఆదర్శాన్ని కోల్పోతుంది. భౌతిక వాదంగానీ, ఆధ్యాత్మిక వాదంగానీ తమ విజయానికి భౌతిక ప్రపంచానికీ మానవుని ఆత్మకూ వున్న సంబంధాన్ని నిరూపించటం మీద ఆధారపడ్డై ఎప్పటి మానవుని అనుభవాన్ని తనలో ఇముడ్చుకోలేని సిద్ధాంతం క్రమేణా మానవునికి దూరమై చిట్టంకట్టి అప్రయోజకం అవుతుంది. ఎప్పటికప్పుడు మానవుని అనుభవాన్ని తనలో ఇముడ్చుకోగల శక్తి గలిగిన సిద్ధాంతం, తను మారుతూ, ప్రపంచాన్ని మారుస్తూ మానవాభ్యుదయానికి సహాయపడుతుంది.

# ఆంధ్రదేశంలో తుపాను బీభత్సం

అగడాల్లంక గ్రామంలో వరదవల్ల మునిగిపోయిన ఇండ్లు, ఈ ఇండ్లు యింకా నెలవరకూ నీటిలోనుండి బయటపడవు. (స్వ.వి.)

అగడాల్లంకలో మునిగిపోయినమరోవీధి. వీధిలో దోనెలతో ప్రయాణం చేయడం చూడవచ్చు. (స్వ. వి)

అగడాల్లంక కాలువ, వరిపొలములూ అంతా ఏకంగా జలమయమై, ఒకటే సముద్రంక్రింద మాపటైనృశ్యం. దిశావలయం వరకూ నీరే తప్ప వేరేదీలేదు.

ఏలూరులో మరోకేవకూడలిపోర్టు దృశ్యం. (స్వ. వి.)

ఏలూరులో బియ్యం లేక ప్రజలుస్థితి. రేషను దుకాణాలవద్ద ప్రజాసమూహాలు మూగియున్న దృశ్యం. ఈ దుకాణం బియ్యం లేనందున 9½ గంటలైనా తెరువబడలేదు. ప్రజలు బియ్యం యిస్తారని ఆశతో మూగివున్నారు. స్వ. వి.

తోకలపల్లి





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No 7, Thambu Chetty St., G. T. Madras.